## స్మృత్యంజలి

జ్యోతి సంస్థాపకులు

కీ॥శే॥ వి వి రాఘవయ్యగారు

1928-1971



మీ కార్యదీక్షా, శ్రమశిక్షణా, సహృదయతా మాకు ఆశీస్సులై నిలుస్తుండగా మీరు స్థాపించిన ఈ సాహితీజ్యోతి వెలుగుతో మునుముందుకు సాగుతున్నాము మీరు మాకు దూరమైన క్షణాన్ని కసితీరా తిట్టుకుంటూ, మీ జ్ఞాపకాల్ని మననం చేసుకుంటూ మీకు మా స్మృత్యంజలి ఘటిస్తున్నాము

జ్యోతి కుటుంబం

స్థాపకులు
వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 21 మార్చి 1983 సంచిక 2

# ఇదీ వరస



ఈనెల నవలానుబంధం

జ్యోతి, భాగ్యలక్ష్మి నవలల పోటీలో ప్రథమ బహుమతి పొందిన నవల

## అనుక్షణం

రచన :

## వి. రాజారామమోహనరావు

జ్యోతి [illegible] నెం. [illegible], హైదరాబాదు - 20

జయప్రద ముఖచిత్రం




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి

కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది

ఫలితం ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి

**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!**

CKGE 882 86 TL

# తొలిమాట



## మూడో దశాబ్దంలోకి....

రెండు దశాబ్దాలు దాటి మూడో దశాబ్దంలోకి పాఠకుల ఆనందానికి రూపంలా ముందడుగు వేస్తోంది జ్యోతి. ఈ సందర్భంలో పాఠకులకి, రచయితలకి, కార్టూనిస్టులకి, ప్రకటన దార్లకి, ఏజంట్లకీ కృతజ్ఞతలు తెలుపుతోంది జ్యోతి.... ఇంతవరకు మీరంతా అభిమానించినట్టే ఇకముందు కూడా జ్యోతిని ప్రోత్సహించి ఆదరిస్తారని జ్యోతి భావిస్తోంది.

ఈ సంచికతో ఆరంభమవుతున్న పోటీ నవలలని చదివి మీ అభిప్రాయాలని మాకు రాయడం మర్చిపోకండి.... పోటీ నవలల గురించి అభిప్రాయాన్ని ప్రచురిస్తున్నాము.

జ్యోతి మాసపత్రికకు మొదటి నుంచీ ఆప్తులు శ్రీ బాపుగారి కార్టూన్లని విరివిగా మీ ముందుంచగలుగుతున్నందుకు మేము గర్విస్తున్నాము.

జ్యోతి మూడో దశాబ్దారంభంలో పాఠకులకు మంచి మంచి శీర్షికలు, కథలు, సీరియల్ నవలలనీ; ఎవరెంత అనుకరించి ఆనంద పడుతున్నా తరగని కొత్తదనాన్నీ జ్యోతి ఇకముందు చూపగలదని విశ్వసిస్తున్నది.

పండితుడూ, సత్కవీ, జ్యోతికి సుపరిచితులూ అయిన శ్రీ పిలకా గణపతి శాస్త్రిగారి స్మృతికి జ్యోతి నివాళులర్పిస్తోంది...

వి. వెలువాల రఘురాము

చాలా కాలానికి మళ్ళీ మా శ్రీశ్రీ గారి ప్రహేళికను చూచి చాలా సంతోషించాను. పజిలు పూర్తిచేసి పంపమని మీరు కోరకున్నా చేసి పంపుతున్నాను. నాలా కొన్ని వందలమంది పంపిస్తే, పజిలుమీద మాకున్న ఆసక్తి మీరు గ్రహించి శ్రీశ్రీ గారిమీద మా తరపున వత్తిడితెచ్చి ఈ శీర్షిక నిరాఘాటంగా కొనసాగిస్తారని నా ఆశ.




జ్యోతి చాలా బావుంటోంది "హ్యూమరాలజీ" చాలా బాగుంది. ముళ్ళపూడిగారి తర్వాత ఆస్థానం శ్రీ యర్రంశెట్టి శాయిగారు నిలుపుకోగలుగుతారు పర్సిస్టెంట్‌గా - హాస్య కథలు రాస్తే'

- ఎన్. కె రామారావు, నల్లగొండ.

★ ★

ఎన్ టి రామారావుగారి ముఖచిత్రంతో వెలువడిన ఫిబ్రవరి జ్యోతి సర్వాంగసుందరంగా ఉంది యండమూరిగారి 'డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు' చాలా ఆసక్తికరంగానూ, ఉత్తేజకరంగానూ సాగుతూ మమ్ములను మంత్రముగ్ధులను చేస్తున్నది ఇది పుట్టినరోజు సంచిక కావడం మిక్కిలి ఆనందదాయకం. మా అభిమాన కథానాయకుడు అక్కినేనిగారితో ఇంటర్వ్యూ ద్వారా మాకు తెలియని ఎన్నో సినీ అనుభవాలను వారిద్వారా తెలుసుకున్నాం. 'ఆ అనుభవం కావాలి' వి. మోహన్‌కుమార్‌గారి సీరియల్ కొత్తదనాన్ని సంతరించుకొని చాలా ఇంట్రస్టింగా ఉంది. యద్దనపూడివారి ఫ్లాష్‌బ్యాక్ ప్రచురించినందుకు జ్యోతికి మా అభినందనలు. ఎన్ టి ఆర్ గారి ఇంటర్వ్యూ కోసం ఎదురుచూస్తున్నాం

నిమ్మగడ్డ బాలసుబ్రహ్మణ్యం, విజయవాడ.

★ ★

ఫిబ్రవరి సంచికలో మీరు ప్రచురించిన శ్రీశ్రీ గీతం, ఆరుద్ర పదాలూ రావికొండలరావు కథ చాలాచాలా బాగున్నాయి- మీ స్థాయిని నిలబెట్టే రచనలు

అవి. అప్పుడప్పుడు ఇలాంటివి ప్రచురించ ప్రార్ధన. బాపు కార్టూన్లు హైలెట్ ఈసారి; 'స్థిరతా నహి నహిరే' నవల చాలా హాయిగా సాగింది. ఈ కాలం యువకుల అవ్యక్తధోరణి గురించిన గొప్ప చిత్రణ అది. రచయితకి ధన్యవాదాలు.

సురమౌళి. సి హెచ్. చీరాల.

★ ★

ఎన్ టి.ఆర్ ముఖచిత్రంతో విడుదల చేసిన జ్యోతి ద్వారా చాలా ఆనందించాను. ఎ.బి.సి వారి లెక్కల ప్రకారం మా(మీ) పత్రిక ఉన్నతశ్రేణికి రావడం అభిలషించదగ్గది. ఎల్లప్పుడూ మీరు ప్రవేశపెడుతున్న కొత్తదనాన్ని మేము గమనిస్తూనే ఉన్నాము. గత చాలా సంవత్సరాలనుంచీ జ్యోతి మా అభిమానపత్రిక అని చెప్పగలము కానీ ప్రింటింగ్ విషయంలో శ్రద్ధవహించాలి మీరు. అనుబంధనవల చాలా బాగున్నది. శైలి అద్భుతం యండమూరి రచన మహాద్భుతం యండమూరి రచన ఇంకాఇంకా సాగాలని ప్రార్థన

ఎన్. శ్యామలాకిరణ్, గుడివాడ.

★ ★

క్షమించండి శ్రీ మోహన్‌కుమార్‌గారి సీరియల్ మొదటలో వున్న వుత్సాహం కన్పించుటలేదు. ఎంతో ఇంట్రెస్టింగుగా ఉన్నదనిపించి ఇలా చల్లబడిపోవడము మాకు నచ్చలేదు. బోరింగ్‌గా ఉన్నదని చెప్పక తప్పదు. సీరియల్‌ని మెరుగుపరచవలసిందిగా రచయితకు మా మ వి నవలానుబంధం నవల బాగానేఉంది కొత్తఅంశాన్ని రాశారు యండమూరి సీరియల్ మలుపుకు హేట్సాఫ్.

వి. భావనారాయణ, ఏలూరు. ★

సార్! ఫిబ్రవరి జ్యోతి చదివాను మీ జ్యోతి సర్క్యులేషన్ పెరగటాన్కి అభిమాన రచయిత శ్రీ యండమూరి రచనేకారణమంటే మీకు కోపంరాదు అనుకొంటాము.

భార్గవి ఎల్. మైసూరు.



## ఎల్. వి. ఆర్. ఛారిటీస్

మద్రాసు నగరంలో ఎల్ వి ఆర్ ఛారిటీ వారు వైద్యవాహన సమ
హాయం. మురికివాడల పిల్లలకోసం కల్పించారు తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ
ఎం జి. ఆర్ ప్రారంభోత్సవ సభకి అధ్యక్షత వహించి, వాహనాన్ని విడుదల
చేశారు




ఎల్ వి.ఆర్ ఛారటీస్‌వారి ట్రైసికిల్‌పై విడుదల చేస్తున్న యం.జి.ఆర్

అతడేగాక, అంగవైకల్యం గలవారికోసం ట్రైసికిల్, గుడ్డివారు, వితం తువు లయిన స్త్రీలకు బట్టలను, అడయార్‌లోని అనాథ బాలల సంస్థకి స్కూల్ యూనిఫారములు, ప్రధాని 20 సూత్రాల పథకానికై చీరలకు పుద్దేశించి 10,000 రూపాయల నగదు ఎల్.వి.ఆర్ ఛారిటీస్‌వారు విడుదల చేశారు.



వైద్యవాహనం

## సాహిత్య అకాడమి బహుమతి ప్రదానోత్సవాలు

ఇటీవల జంటనగరాలలో జరిగిన అకాడమీ బహుమతి ఉత్సవంలో విశిష్ట సభ్యులుగా శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిని, సంస్కృత విద్వాంసులు శ్రీ ఎస్ వి. సుబ్బరామశాస్త్రికి సన్మానం జరిగింది. కవితావిషయమై శ్రీకరుణశ్రీకి, విమర్శ విషయమై శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులకి, కథల విభాగంలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవికి, రచయిత్రిగా శ్రీమతి సి. వేదవతికి, నాటక విభాగంలో శ్రీ ఎం.వి.యస్. హరనాధరావుకి, ఇతర రచనా విభాగంలో శ్రీ మిక్కిలినేనికి బహుమతులు లభించాయి. ఎండోమెంట్స్ విభాగం తరపున శ్రీ వానమామలై వరదాచార్యులకి, శ్రీ ఇంద్రగంటివారికి, శ్రీ మళ్ళపూడి వెంకటరమణకి, శ్రీమతి మాలతీ చందూర్‌కి బహుమతి సత్కారం జరిగింది. కీ॥శే॥ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య బహుమతి సత్కారపత్రం చదివారు. శ్రీమతి కోడూరి కౌసల్యాదేవి గారిని ప్రశంశిస్తూ సత్కారపత్రం చదివారు.

జ్యోతికి సన్నిహితులు శ్రీమతి మాలతిచందూర్ గారికి, జ్యోతి సాహితీ మిత్రుడూ, రచయిత, నాటకదర్శకుడు, నటుడూ శ్రీ ఎం.వి.యస్. హరనాధ రావుకీ, జ్యోతి చిరకాల ఆప్తమిత్రుడు, హాస్యబ్రహ్మ శ్రీ మళ్ళపూడి వెంకట రమణకి, జ్యోతి హితైషి, సాహితీ మిత్రురాలు శ్రీమతి కోడూరి కౌసల్యాదేవి గారికి ఈ సందర్భంలో ప్రశంశాభినందనలు ప్రత్యేకంగా తెలియజేస్తున్నాము.

కుమారి వాసిరెడ్డి సీతాదేవి
ద్వారా మీకందించబోతున్న అపురూప కానుక . ఎదురుచూడండి ఎవ్వరూ
కొత్తదనాన్ని పరిచయం చేసే జ్యోతి శుసొం తెలుగు పత్రికా రంగంలోకి
తెస్తున్న తియ్యని కానుక



స్నేహితురాలు బిల్కిస్ అలాడీన్ తో రచయిత్రి బార్బరా కార్ట్‌లాండ్

తెలుగు గుండెకి ఇంగ్లీషు పువ్వు

! తెలుగులో బార్బరా కార్ట్‌లాండ్ !

మీ కోసం.... మీ అభిరుచి కోసం.... జ్యోతి కానుక.... సరికొత్త సీరియల్...

దాదాపు 350 నవలలకు రచయిత్రి...

200 మిలియన్లకి పైగా పుస్తకాలు అమ్ముడయిన ప్రఖ్యాతి...

అనేకమంది దేశదేశాల రచయితలకు స్ఫూర్తినిచ్చిన..

# బార్బరా కార్ట్‌లాండ్

ప్రేమ రసాయనంలో తియ్యని కన్నీరు కలిపి చందనం చేసి

రూపొందించి, ఇంకా ముద్రణ కాని సరికొత్త ఆంగ్ల నవల

LOVE ON WIND ని వారి కోరికపై

## 'ప్రణయ వీచికలు' గా

అనువదించి సీరియల్‌గా మీ ముందుంచుతున్నా

## వాసిరెడ్డి సీతాదేవి

.... .... ....

అపూర్వ ప్రేమ నవలా రాణిని తెలుగు గుండెలోకి ఆహ్వానించండి... వచ్చేనెల నుంచీ ఆరంభం...

# నవలల పోటీ గురించి

మేము పెద్దఎత్తున నిర్వహించిన ఈ నవలల పోటీకి, రచనలు కూడా పెద్దఎత్తునే వచ్చాయి. సంఖ్యకు తగ్గట్టుగా, ఇతివృత్తంలోనూ, శైలిలో కూడా వైవిధ్యం కొట్టొచ్చినట్టు కనిపించింది. కొత్త రచయితలు చాలామంది కలం పట్టినట్లు తెలుస్తోంది.

రచనలన్నీ చాలావరకు ఆర్థిక అసమానతనే ఇతివృత్తంగా కలిగి వాస్తవాలకు దగ్గరగా ఉన్నాయి. న్యాయనిర్ణేతలలో ఒకరైన శ్రీమతి మాలతిచందూర్ అన్నట్లు "మన రచయితలకు సామాజిక అవగాహన లేదు అని విమర్శిస్తున్నవారంతా ప్రస్తుతం వస్తున్న సాహిత్యాన్ని చదవకుండా విమర్శ చేస్తున్నారు. అని ఈ నవలలు చదివిన ప్రతివారూ ఒప్పుకుంటారు".

నవలల న్యాయనిర్ణయాలలో మాకు సహకరించిన శ్రీ డి. వెంకట్రామయ్య, శ్రీమతి మాలతీచందూర్, శ్రీ వాసిరెడ్డి నారాయణరావు గార్లకు మా కృతజ్ఞతలు.

ఎంతో ఉత్సాహంతో పోటీలో పాల్గొన్న రచయితలందరికీ మా అభినందనలు!

విజేతలను జ్వాల అభినందిస్తూ ముందు ముందు మరింత మంచి రచనలు చేయాలని కోరుతూంది.

పాఠకులకోసం నూతన శీర్షిక

# ఇదీ మన ప్రపంచమే

మనదో ప్రపంచం....పరాయి..... ప్రపంచం అంటూ లేవు....

కానీ....

ఈ సువిశాల ప్రపంచంలో వివిధదేశాల మానవ జీవిత వైవిధ్యంలో మనకి అందుబాట్లో లేని....లేదా కొందరికి మాత్రమే అందుబాట్లో వున్న వార్తలు, విశేషాలు, వింతలు చాలా ఉన్నాయి. వాటిగురించి, ఆ ప్రదేశాలవారి ప్రవృత్తుల గురించీ తెలియనంతవరకూ అది మనకి తెలియని ప్రపంచమే.

ఆ తెలియని వార్తా ప్రపంచాన్ని మీ ఆలోచనా ప్రపంచంలోకి తెచ్చే సరికొత్త శీర్షిక....

కొత్తపాళీ : 'లలిత్'

వచ్చే సంచికనుంచీ ప్రారంభం

Wiltedge

Wiltedge

**ఇది హఠాత్తుగా తయారైనదేం కాదు కాని,
షేవింగ్ క్షేత్రంలో ప్రమాణాలను
స్థాపిస్తూ వస్తున్న ఉత్కృష్ట నాణ్యత ఫలితమే
ఇలాంటి రేజర్ బ్లేడ్ విల్ట్ఎడ్జ్.**

విల్ట్ఎడ్జ్.
విల్కిన్సన్ స్వోర్డ్ వారి ఉత్కృష్ట నాణ్యత ఫలితమే ఈ రేజర్ బ్లేడ్ ప్రపంచంలోని అత్యంత నిశితమైన బ్లేడ్‌ల వెనుక వున్న ఉత్కృష్ట నాణ్యత.

విల్ట్ఎడ్జ్.
దిగుమతి చేయబడిన ఉక్కుతో తయారై, యాంత్రిక సానరాయి మరియు తోలుపట్టీ మీద పదును పెట్టబడి 'గోథిక్ ఆర్చ్' ఆకారం పొందిన మొనతో కూడిన రేజర్ బ్లేడ్ — ఈ గోథిక్ ఆర్చ్ మొన ఎన్నో సంవత్సరాల తీవ్ర సంశోధన ద్వారా ఉత్కృష్టం చేయబడి మరియు పి టి ఎఫ్ ఇ. పూత కల్గించింది. షేవింగ్ టెక్నాలజీలో సంతరించిన మహత్వపూర్ణమైన ఏకైక ప్రగతి. మీకు మునుపెన్నడూ లభించని అతి నున్నని, సురక్షితమైన మరియు చక్కటి షేవ్‌ను అందించడానికి, అవా...షేవ్ తర్వాత షేవ్...ఎన్నో-మరెన్నో షేవ్‌లు నిజానికి ఎన్ని ఎక్కువ షేవ్‌లంటే దీని కోసం కాస్త ఎక్కువ పైకాన్ని ఖర్చు పెట్టడానికి మీరు ఏమాత్రం వెనుకాడరు.

Wiltedge

Wiltedge

విల్ట్ఎడ్జ్.
ఇది మీపై చెరగని ముద్రను వేసి పోతుంది. దీని నాణ్యత అసమానం, దీనితో లభించే షేవ్‌లు అధికం.

**విల్ట్ఎడ్జ్: మరింత ఎక్కువ పొందాలని
అభిలషించేవారి కోసం- ఎక్కువ షేవ్‌లు,
ఎక్కువ సుఖం, ఎక్కువ సంతృప్తి.**

---

**Wiltech India Ltd.**

---

Rediffusion/WIL/1785h/TL

# భాగ్యలక్ష్మి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర లాటరీ



**ప్రత్యేక బంపర్ డ్రా — 8-2-1983**

బంపరు బహుమతి : రూ. 10 లక్షలు

మొత్తం బహుమతుల విలువ : రూ. 29,70,000

మొత్తం బహుమతులు : **1,03,831**

పదిహేను రోజుల డ్రా

ప్రతి నెల 8 మరియు 23 తేదీలలో.

మొత్తం బహుమతుల విలువ : రూ. 6 లక్షలు

మొత్తం బహుమతులు : **33504**

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర లాటరీలు

# యండమూరి వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు
# డబ్బు

లక్ష్మికి ఆస్పత్రి సౌకర్యాలన్నీ సిద్ధంచేసి, హోంమినిష్టరుతో గాంధీ ప్రధానమంత్రిని కలిశాడు. పేపర్, టెక్స్ట్బుక్ పరిస్థితులు, నిర్ణయాలూ చర్చించారు. పేపర్ పరిశ్రమని జాతీయం చేయడమైంది. రామ్మోహనరావు మంత్రి పదవి, శివకైలాస్ బాంకు డైరెక్టర్షిప్ పోవడం-జరిగాయి. అంజిరెడ్డికీ, గాంధీకి భేటీ.... లక్ష్మి స్థితి ప్రమాదకరం - కదుల్లామంటే గాంధీకి తన జీవిత పోటీకి గడువుతేదీ బెదిరింపు.... హారిక గాంధీ మీద ప్లాన్ ఈ లోగా వాయువేగ్ స్కూటర్ ఉత్పత్తి సిద్ధం. విద్యార్థి నేర్చిన విద్య గాంధీమీద చూపించాడు మంచి నీళ్ల ఇరవై లక్షలకి అమ్మడంతో

- ఇక చదవండి -

"ఇది అన్యాయం" అన్నాడు గాంధీ.

"ఏది అన్యాయం? ధరని డిమాండ్- సప్లైల బట్టి నిర్ణయించటం అన్యాయమా? అలా అయితే ఇన్నాళ్ళ నుంచీ మనం చేస్తున్న వ్యాపారమే తప్పు" అన్నాడు విద్యార్థి.

"నీ మనసులో ఇంత కుత్సితమైన ఆలోచనలు ఇంతకాలం నుంచీ వున్నాయని అనుకోలేదు".

"వున్న వస్తువుని అమ్మాలనుకోవటం కుత్సితమైన ఆలోచన కాదు. నేనేమీ పిస్తోలు చూపించి మిమ్మల్ని బెదిరించటం లేదే. మీకిష్టం లేకపోతే మానెయ్యండి"........

గాంధీ కొంచంసేపు ఆలోచించాడు. తరువాత అన్నాడు "....కారుని ముందుకు పోనిచ్చి దారి ఎక్కడ వెడల్పుగా వుంటే అక్కడ రివర్సు చెయ్యి".

విద్యార్థి మారు మాట్లాడకుండా ముందుకు పోనిచ్చాడు. పది నిముషాలు గడిచేసరికి గాంధి దాహానికి మరి తట్టుకోలేక పోయాడు ఇరవై లక్షలూ విద్యార్థికి




ఇచ్చేస్తే- ఇక తను పందెం ఓడిపోయినట్టే. ఈ అయిదు సంవత్సరాలు కష్టపడిందీ బూడిదలో పోసిన పన్నీరే అవుతుంది. కానీ దాహం ...."




"కారాపు" అన్నాడు. విద్యార్థి కారు ఆపేడు. గాంధీ బ్రీఫ్‌కేస్ అతని వైపు తోసి "నీళ్ళ బాటిల్ ఇవ్వు" అన్నాడు. విద్యార్థి గాంధీ మొహంవైపు పరికించి చూసి, మారు మాట్లాడకుండా వాటర్ బాటిల్ అందించాడు. గాంధీ నీళ్లు తాగి, బాటిల్ వెనుక సీటులోకి విసిరేసాడు. సీట్లు వెనక్కి వాలి నిస్త్రాణగా కళ్లు మూసుకుంటూ "ఇక బేతంచర్ల వెళ్ళనక్కర్లేదు వెనక్కి తిప్పు. ప్రొద్దునకల్లా మన వూరు చేరుకోవాలి. ఇంకో విషయం.... రేప్రొద్దున్నుంచీ నీకూ నాకూ ఏ సంబంధం లేదు పేపరు మిల్లునుంచి నిన్ను తీసేస్తున్నాను. నీకు రావల్సిన డబ్బు తీసుకుని పదింటికల్లా నా కళ్ళముందు నుంచి తప్పుకోవాలి. ఆ తరువాత ఒక క్షణం ఆలస్యంగా నువ్వు కనబడినా నిన్ను పేల్చి పారేస్తాను న్యాయబద్ధం అయినా కాకపోయినా సరే...."

విద్యార్థి మాట్లాడకుండా కారు రివర్స్ చేసేడు. అప్పటికే గాంధీ నిద్రలోకి జారుకుంటున్నాడు. ఆతడికి ఆశ్చర్యంగా వుంది. ఎందుకో తనకి 'డిప్రెషన్' కలగటం లేదు. పందెం ఓడిపోతున్నానన్న భావం కలిగించినంత వ్యధ-ఓడిపోవటం కలిగించటం లేదు. యుద్ధం చేస్తున్నంతసేపూ వున్న టెన్షన్ కన్నా- యుద్ధం సమాప్తమయిందన్న నిశ్చింత ఎక్కువ సంతృప్తినిస్తూంది



**రెండుజెళ్ళ సీత**

దేపే మవుతుందోనన్న భయం లేదు. స్టాక్ మార్కెట్ గురించి చింతలేదు. రాజకీయాల గురించిన బాధలేదు. కార్మికుల విషయమై దిగులు లేదు.

చాలాకాలం తర్వాత అతడు హాయిగా నిద్రపోయాడు. రాత్రి ఎంతసేపు గడిచిందో తెలీదు. విద్యార్థి లేపటంతో మెలకువ వచ్చింది. చీకటి మరింత దట్టంగా వుండటంతో నిద్రమత్తులోనే, "అప్పుడే వచ్చేసేమా" అని అడిగాడు.

"వచ్చేసేం"

గాంధీ కళ్ళు పూర్తిగా విప్పి పట్టణపు ఛాయలు ఎక్కడా కనబడక పోవటంతో కన్ఫ్యూజ్ యి, "ఎక్కడికి వచ్చేం" అని అడిగాడు.

"జేతంచర్ల"

గాంధి అర్థంకాక అయోమయంగా విద్యార్థివైపు చూసేడు.

విద్యార్థి బ్రీఫ్‌కేసు గాంధివైపు తోస్తూ, "ఇదే మంత్రిగారిల్లు. రండి వెళ్దాం" అన్నాడు.

"మరి... మరి ..."

విద్యార్థి నవ్వుతూ, "నిన్నరాత్రి సరదాగా అలా అన్నాన్సార్" అన్నాడు.

గాంధీకి విపరీతమైన కోపం వచ్చింది. "నన్నో వెధవనిచేసి నాటకం ఆడటంలో నీ వుద్దేశ్యం ఏమిటి" అన్నాడు కటువుగా. విద్యార్థి మొహంలో నవ్వు మాయమైంది. "సారీ సార్" అన్నాడు నెమ్మదిగా. "మిమ్మల్ని ఇంత కాలం నుంచి చూసీచూసీ నన్ను ఒక అనుమానం నిరంతరం వేధిస్తూ వచ్చింది. డబ్బు సంపాదించటం నిజంగా అంత కష్టమా అన్నప్రశ్న ది. దాని సమాధానం కోసం కొద్దిపాటి చొరవ తీసుకోవలసివచ్చింది. నన్ను క్షమించండి.... ప్లీజ్"

ఆ కంఠంలో నిజాయితీ గాంధీని కదిలించి వేసింది. కొద్దిసేపు మౌనంగా ండి, నెమ్మదిగా "... డబ్బు సంపాదించటం నిజంగా అంత సులభం అంటావా విద్యార్థీ" అన్నాడు.

"లేదుసార్ లేదు...." చప్పున అన్నాడు విద్యార్థి కేవలం ఈ సంఘటనలో నేను హీరోని అయివుంటే అవ్వొచ్చుగాక. కానీ జీవితం కేవలం ఒక్క సంఘటనే కాదుసార్. నేనెప్పుడూ మిమ్మల్ని - మీ జీవిత పంథానీ చూస్తూ




నాలో నేనే ఆశ్చర్యపడుతూ వుంటాను. డబ్బు సంపాదించటం చేతకాని వాళ్ళు ఎన్ని మిట్టవేదాంతపు కవితలైనా, కబుర్లయినా చెప్పనివ్వండి. ఇలా డబ్బు సంపాదన ఒక కళ! సార్ టైమ్ పన్నెండు దాటింది. మీ అయిదు సంవత్సరాల గడువుతీరే ఆఖరిరోజు వచ్చింది. మీరు గెలవచ్చుగాక. ఓడవచ్చుగాక.... ఇక్కడ ప్రశ్న అది కాదు. మీ జీవితం మాలాటి వాళ్ళని ఉత్తేజ పరుస్తుంది. ఆ జీవితమే ఒక పుస్తకం అవుతే అందులో నీతివాక్యం ఎప్పుడూ మాకు మా గమ్యాన్ని సూచిస్తూనే వుంటుంది.... ఇది నా వ్యక్తిగత అభిప్రాయం, నేను మిమ్మల్ని చూస్తూ ఎప్పుడూ మనసులో అనుకుంటూ వుంటాను. ఎవరితను? ఎక్కడివాడు. ఎక్కడ ప్రారంభమై ఎక్కడికి చేరుకున్నాడు. ఎంత మెలకువతో ప్రత్యర్థుల్ని చిత్తు చేసాడు. నేనెప్పటికైనా ఈస్థాయికి చేరుకోగలనా? అని మీరు నా 'హి-మాన్' సార్. మీకిది నవ్వుగా కనిపించవచ్చు, కానీ ఇది మాత్రం నిజం...."

గాంధీ అతడివైపు కన్నార్పకుండా చూసాడు. ఏదో అందామనుకు మళ్ళీ మానేసి, బ్రీఫ్‌కేస్ చేతుల్లోకి తీసుకుంటూ, "నువ్వెవరైనా చెప్పు విద్యార్థీ

## రెండు జెళ్ళ సీత

జంధ్యాల

# రెండు జెళ్ళ సీత

"నేను నీకు ఇరవై లక్షలిచ్చాక" అన్నాడు.

విద్యార్థి ఇబ్బందిగా నవ్వి "నీకు తప్పుతుంటే ఇంకొక రకంగా అన్ని చెల్లగొట్టవచ్చు" అన్నాడు.

"ఎలా?"

"అగో ఈ రోజు సాయంత్రం అయిదింటికి చెప్తాను."

"నా పందెం గడువుకీ దానికీ ఏదైనా సంబంధం వుందా?" అనుమానంగా అడిగాడు గాంధి.

విద్యార్థి తడబడుతూ అవునూ కాదూల మధ్యగా తలూపేడు.

-31-

వాళ్లు అనుకున్నట్టుగా ఆ రాత్రికి రాత్రి తిరిగి వచ్చెయ్యటానికి సాధ్య పడలేదు. ముఖ్యమంత్రి వాళ్ళని వదిలిపెట్టలేదు. ఇంత అర్ధరాత్రి వెళ్ళటానికి వీల్లేదని బలవంతం చేసాడు. ఎంత రాజకీయాల్లో పండిపోయినా, ఇరవై లక్షలు పేర్చివున్న నోట్లకట్టలు- ఆయన ఒక్కసారిగా జీవితంలో స్వంతం చేసుకోలేదు. గాంధీకి తను చేసిన సాయం చాలా చిన్నదని తెలుసు కానీ మాటమీద నిలబడి రాత్రికి రాత్రి అతడు అంత డబ్బు తెచ్చిఇవ్వటంతో అతడిమీద అమితంగా గౌరవం పెరిగింది.

—ఆ తెల్లవారు ఝామున ఆయన దగ్గిర శలవు తీసుకుని తిరిగి బయల్దేరారు.

"ఎన్నింటికి మనం చేరుకోగలం?"

"మధ్యాహ్నం ఒంటిగంట అవ్వొచ్చు"

"అప్పటికి పోస్టు వచ్చేస్తుంది.." అన్నాడు గాంధీ. ఎప్పుడూ కనబడని ఉద్విగ్నత అతడి కంఠంలో కనబడింది. "నేను పందెంలో గెలిచానా లేదా అన్న విషయం తేలిపోయే క్షణం అ..."

"మనం ముఖ్యమంత్రికి ఇరవై లక్షలు ఇవ్వటం ఒక్కరోజు ఆపుచేసి వుండవలసింది" అన్నాడు విద్యార్థి

"అక్కర్లేదు. ప్రజల మూర్ఖత్వం మీదే ఇన్నాళ్ళూ ఆడుకుంటూవచ్చాను. ఈ ఆకరి ఎత్తుకూడా దానిమీదే వెయ్యనీ. ప్రజలు చాలా అప్టిమిస్టులు.... అలా




వరులు....రాత్రికిరాత్రి మంచిస్కూటరు చవగ్గా కొట్టేద్దామన్న ఆశతో అయిదొందలు డిపాజిట్లు చేసేవాళ్ళ లక్షల సంఖ్యలో వుంటారని నా వూహ. అందులో ఈ రోజు ఆఖరిరోజు, వివిధ ఏజెంట్ల దగ్గర్నుంచీ యాభై లక్షలూ వస్తాయనీ, ప్రజల మనస్తత్వంమీద నేను ఆడుతున్న ఈ ఆకరి జూదంలో తప్పకుండా గెలుస్తాననీ నాకు నమ్మకం వుంది.... రెండింటి లోపులో బ్యాంకులు మూసేస్తారు. ఈ లోపులోనే మనం వూరు చేరుకోవాలి...." అంటూ కారువేగం హెచ్చించాడు.

ఊరు పొలిమేరలు చేరుకునేసరికి మధ్యాహ్నం ఒంటిగంట దాటుతూంది. గాంధీ కంగారు పడ్డాడు. చెయ్యవలసిన పని చాలా వుంది. చాలా చోట్లనుంచి టి.టి.లు (టెలిగ్రాఫిక్ ట్రాన్స్ఫర్లు) రావాలి. అదీగాక ఒకేరోజు ఒకే బ్యాంకు నుంచి యాభై లక్షలు తీసుకుంటే రకరకాల ప్రశ్నలు ఉత్పన్నమవుతాయనీ, ముందే దాదాపు పాతిక బ్యాంకుల్లో అకౌంట్లు ప్రారంభించాడు. అన్ని బ్యాంకుల్లోనూ డిమాండ్ డ్రాఫ్టులు తీసుకోవాలి. (చెక్కులయితే రామ్మోహనరావు అంత డబ్బు నిజంగా బ్యాంకులో వుందని నమ్మకపోవచ్చు). డ్రాఫ్టులు కాక, కాష్ రూపంలో వచ్చే డబ్బుని సరిచూసుకోవాలి ...

చాలా పనివుంది.... అరగంటలో చెయ్యవలసింది. కారు ఆఫీసు ముందు ఆపి- వాచీ చూసుకున్నాడు, 1.35 పి.యమ్.

వెనుక సీటులో నిద్రపోతూన్న విద్యార్థి కారు ఆగేసరికి కళ్లువిప్పి- ఆఫీసు బిల్డింగు చూసి ఆశ్చర్యంతో, "ఇదేమిటి ఇక్కడికి వచ్చాం" అని అడిగాడు. గాంధీ కారు దిగుతూ, నువ్వు ఆస్పత్రికి వెళ్లు విద్యార్థీ! నేను సరిగా అరగంటలో అక్కడ వుంటాను" అంటూ ఆఫీసులోకి పరుగెత్తాడు.

కుర్చీలో పూర్తిగా కూర్చోకుండానే ఫోను దగ్గరగా లాక్కొని వరుసగా ప్రతీ బ్యాంకుకీ ఫోనుచేసి, వివిధ ఏజన్సీల దగ్గర్నుంచీ పోగైన డబ్బు ఎంత వచ్చిందో తెలుసుకుంటూ, ఒక కాగితంమీద వ్రాసుకోసాగేడు. డ్రాఫ్టులు తయారుచేసి వుంచుతే ఎవరినైనా పంపి తీసుకుంటానని చెప్పాడు.

ఆకరి బ్రాంచికి ఫోన్ చెయ్యటం పూర్తయ్యేసరికి రెండుగంటలా అయిదు నిముషాలు అయింది. బ్యాంకులకి మనిషిని పంపాడు.



రెండుంపావుకి పోస్ట్ వచ్చింది. డైరెక్టుగా వచ్చిన డ్రాఫ్టులు అవి.

ఒక్కొక్క కవరు విప్పుతూవుంటే చేతులు వణకసాగాయి. ఈ లోపులో బ్యాంకులకి వెళ్ళిన మనిషి డ్రాఫ్టులూ, డబ్బూ తీసుకొచ్చాడు.

అతడి ముందు నోట్లకట్టలూ-డ్రాఫ్టులూ....

అయిదు సంవత్సరాల కఠోర పరిశ్రమకి ఫలితం గెలుపో-ఓటమో తేలి పోబోయే క్షణం దగ్గిరపడింది.

అంకెల మొత్తం కాగితం మీద వేసుకోవటం పూర్తయ్యేసరికి పావుగంట పట్టింది. టోటల్ చెయ్యాలి.

ఒకసారి కాగితం వైపు చూసి, గుండెల్నిండా గాలి పీల్చుకుని కూడటం మొదలుపెట్టాడు. నాలుగు అంకెలు కూడేసరికి తనకావని అసాధ్యం అని తేలి పోయింది. ఎంత ఏకాగ్రతతో చేద్దామన్నా కుదరటంలేదు. కూడిక మాటిమాటికీ తప్పుతూంది. ఇక లాభం లేదనుకొని, ఇంటర్‌కమ్‌లో సెక్రటరీని పిల్చి కూడమని చెప్పాడు. ఆ అమ్మాయి ఎదుటి కుర్చీలో కూర్చొని కూడుతూ వుంటే, తలవెనక్కి వాల్చి కళ్లు మూసుకున్నాడు. కెరటాల్లా గతస్మృతులు లేచిపడు తున్నాయి. ఉద్వేగంతో శరీరం వణుకుతూంది.... అయిదు సంవత్సరాల క్రితం తను ఇంటర్వ్యూకి బయల్దేరటం .... రామ్మోహనరావుతో మాట మీద మాట




పెరగటం- తను పంతం వెయ్యటం- తరువాత తనకి జరిగిన అవమానంతో అతడిమీద పగ పెంచుకోవటం-ఎత్తులు పై ఎత్తులు పది పైనల్తో మొదలైన

## రెండు జెళ్ళ సీత

ఆట, రాష్ట్ర ముఖ్యమంత్రిని మార్చటం వరకూ కొనసాగటం....

"సార్"

గాంధీ కళ్ళు విప్పాడు

"టోటల్ చేసేసేను సార్", నెమ్మదిగా- భయపడుతూ అంది.

"ఎంతొచ్చింది". ఊపిరి బిగపట్టి అడిగాడు. ఆ అమ్మాయి కాగితాన్ని తనవైపుకి తిప్పుకుని దాన్ని చూస్తూ అన్నది -

"వలభై ఎనిమిది లక్షలా యాభై వేల అయిదొందలు".

కుర్చీలోంచి ముందుకు జారిపోయి - బల్లని ఆసరాగా తీసుకుని నిల దొక్కుకున్నాడు గాంధీ. ఆ అమ్మాయి గాంధీవైపు చూపింది. ఈ పందెం విషయం ఇప్పుడు ఎవరికీ తెలియనిదికాదు. తన లెఖ్ఖ తప్పయితే ఎంత బావుణ్ణు అనుకుంటూ మళ్ళీ చూసింది. కానీ కరెక్టుగానే ఉంది. లేచి ముందు గదిలోకి వచ్చేసింది.

చేతులు బల్లమీద ఆన్చి కళ్ళు మూసుకుని అలా ఎంతసేపున్నాడో అతడికే తెలీదు. గడియారం మూడున్నర కొట్టింది. ఇంకా గంటన్నర....గంటన్నరలో లక్షా యాభై వేలు ఎక్కణ్ణుంచి సంపాదిస్తాడు? - ఆ సంపాదన కూడా 'అప్పు' అయి వుండకూడదు....

గెలుపైనా బావుణ్ణు- పూర్తి ఓటమి అయినా బావుణ్ణు! కానీ....కానీ ఇంత తక్కువలో గెలుపు చెయ్యి దాటిపోవటం ఎంత బాధాకరం.

ఆ గదిలో నిశ్శబ్దాన్ని భరించలేక అతడు బైటకు వచ్చాడు. తన ఛాంబర్ తలుపు తెరిచి బైటకు వస్తూ ముందుగదిలో దృశ్యాన్ని చూసి విచలితుడయ్యాడు. అతడి సెక్రటరీ - ఆ పద్దెనిమిదేళ్ళ అమ్మాయి, తన టైప్ మిషన్ముందు కూర్చొని, వెక్కి వెక్కి ఏడుస్తూంది. అతడు ఆమె దగ్గరగా వెళ్ళి ఏమైందని అడిగాడు. ఆ అమ్మాయి వెంటనే జవాబు చెప్పలేదు. తరువాత నెమ్మదిగా, "మనం....మనం ఓడిపోయాంసార్" అంది.

ఒక్కసారిగా చల్లటి నీళ్ళు మొహంమీద పడినట్టు వెన్ను జలదరించి గాంధీ విశ్చేష్టుడయ్యాడు. అది ఆనందమో విషాదమో తెలీదుకానీ, తన వెనుక ఇంతమంది వున్నారన్న భావం అతడి మనసుని దిపేసింది. కళ్ళలో నీళ్ళ




గ్రుక్క తిరిగింది. కానీ వెంటనే తేరుకుని, జీవంలేని నవ్వుతో "ఇట్స్ ఒకే.... బీ బ్రేవ్" అంటూ ఆమె చేతిని తట్టాడు.

ఇంతలో బైట తలుపు మీద కొట్టిన చప్పుడయింది. క్షణం తరువాత తలుపు తెరుచుకుని ఇద్దరువ్యక్తులు లోపలికి వచ్చారు. ఒకరు సూటులో వున్నారు. ఇంకొకరు పిల్కులాల్చీ పంచలో ఉన్నారు. చాలాకాలం తరువాత చూసినా గాంధీ వారిని గుర్తుపట్టగలిగాడు.

ఒకప్పుడు టి.ఎఫ్.టి. కంపెనీ స్థాపించిన వారిలో టాటావాలా కాక మిగతా ఇద్దరూ వాళ్లు!

ఫెర్నాండజ్.... త్రివేది

oo oo oo

అతిరధులూ, మహామేధావులూ ఆడుతున్న ఈ ఆటలో ఏ గమ్యమూ లేకుండా మిగిలిపోయినది ప్రియంవద మాత్రమే! గాంధీ జీవితంలాగే ఆమెది కూడా ఎక్కడో ప్రారంభమయి ఎక్కడో తేలింది. పెళ్ళయిన తరువాత హీనచరితుడైన ఆమె భర్త ఆమెని చరిత్రహీనురాలిని చేశాడు. ఒకసారి నైతి



## రెండు జెళ్ళ సీత

జంధ్యాల కేశవరావు

కంగా పతనమయిన తరువాత ఆమె భర్తతోపాటే ఆ చీకటి ప్రపంచంలోనే పయనించింది. లక్ష్మికి ఆమెకీ మొదటి నుంచీ పడలేదు లక్ష్మిస్వచ్ఛత ఆమెని భయపెట్టేది. రామ్మోహనరావు హనుమంతరావుని తన మనిషిగా గాంధీ శిబిరంలో ప్రవేశపెట్టినపుడు, భర్తతోపాటూ మొదటిసారి గాంధీని చూసింది. అప్పటివరకూ ఆమె చూసిన జీవితం వేరు. ఆ ప్రపంచంలో మొగవాడు స్త్రీని కేవలం వస్తువుగానే చూసేటు. ఒక గమ్యాన్ని నిర్ణయించుకొని, దానివైపే దీక్షగా సాగిపోయే గాంధీలాటి వ్యక్తి ఆమెకు అప్పటివరకూ తారసపడలేదు అతడివైపు ఆకర్షితురాలై ఆ ఇన్‌ఫాక్చుయేషన్‌లో భర్త గూఢచారితనం గురించి చెప్పేసింది. గాంధీ రామ్మోహనరావు ఎత్తుని తిప్పికొట్టాడు. దాని ఫలితంగా భర్త ఏమయ్యాడో తెలియని స్థితి ఏర్పడింది. ఆ నిస్సహాయస్థితిలో అనాథగా రామ్మోహనరావు ఇంట్లో ప్రవేశించి అతడి రహస్యాలు తెలుసుకొమ్మని గాంధీ కోరాడు. అందులోని అంతర్లీనమైన కష్టం ఆమెకి తెలుసు. పెళ్ళయిన మొదట్లో భర్త ఈవిధమైన వెసులుబాటుకోసమే ఆమెని ట్రాన్స్‌ఫార్మ్ చేశాడు. మళ్ళీ ఇప్పుడు....కొంచం గౌరవప్రదంగా గాంధీ....

ఆమె మౌనంగానే దీనికి ఒప్పుకుంది.

ఆమెకు పెద్దగా లోకజ్ఞానం లేదు. కానీ గడ్డిపువ్వుకూడా ఓ విలువ ఆపాదించబడుతున్నందుకు ఆమె సంతోషించింది. ఇందులో ఆమె కొత్తగా కోల్పోయేది ఏమీలేదు.

'హనుమంతరావు ఏమయ్యాడో తెలిసేవరకూ ఆమె మనింట్లోనే వుంటుంది' అన్న మిషమీద రామ్మోహనరావ్ ఆమెని తన అవుట్‌హౌస్‌లో పెట్టాడు. అప్పటికే అతడి గుండెనొప్పి భార్య చచ్చిపోయి రెండుసంవత్సరాలైంది. తెలివైన హారిక తొందర్లోనే విషయాన్ని గ్రహించింది భర్తతో వున్నప్పుడు లక్ష్మినుంచి ఏవిధమైన వ్యతిరేకతని ఎదుర్కోవలసివచ్చిందో ప్రియంవద ఆదేరకమైన వ్యతిరేకతని రామ్మోహనరావు ఇంట్లో హారికనించి ఎదుర్కోవలసి వచ్చింది. పళ్ళబిగువున తన మనసులో ఆలోచనని అదిమిపెట్టి గాంధీ చెప్పిన పని పూర్తిచేసింది. ఫలితంగా రామ్మోహనరావు ఇంటిమీద సి.బి.ఐ. రైడ్ గ




జరిగింది. ఆ తరువాత ఆమెకి ఏం చెయ్యాలో తోచలేదు. గాంధీ కృతఘ్నుడు కాడు. ఆమెకి తెలిసినచోట చిన్న ఉద్యోగం ఇప్పించాడు. అప్పటికే లక్ష్మి పేపర్ మిల్లుకి వెళ్ళిపోయింది. గాంధీ ఒక్కడే వుంటున్నాడు. అందువల్ల ఆమె అతడింట్లో వుండక చిన్న ఇల్లు తీసుకుంది. ఒక్కసారిగా ఆమె జీవితంలో శూన్యత ప్రవేశించింది. యుద్ధం అయిపోయిన తరువాత కొసప్రాణంతో వున్న సైనికుణ్ణి మిగతావారందరూ వదిలేసి వెళ్ళిపోతే ఆరాత్రి రణరంగపు నిశ్శబ్దంలో పోయే ప్రాణం కోసం ఎదురుచూస్తూ పడున్న పరిస్థితి ఆమెది. రామాయణంలో ఎవరి సానుభూతీ లభించని కైకేయి పాత్రలాటిది ఆమెస్థితి.

చాలా మామూలుగా- కానీ నాటకీయంగా జరిగింది ఆ సంఘటన. ఆ రోజు ఆమెతోపాటూ పనిచేసే స్నేహితురాలు ప్రియంవదను భోజనానికి పిలిచింది. వాళ్ళదగ్గిర టేప్‌రికార్డరు వున్నట్టు ఆమెకి తెలుసు. తమింట్లో ఎప్పుడో భర్తతెచ్చి షదేసిన రెండు క్యాసెట్లు ఉన్నాయి. ఎలాగూ తనకి పనికిరావని తీసుకుని వెళ్ళి స్నేహితురాలికి ఇచ్చింది.




భోజనాలయి ఇద్దరూ కూర్చున్నాక, ఆవిడ టేప్‌రికార్డరు పెడ్తూ 'నువ్వు




తెచ్చిన కేసెట్లో మంచిపాటలు ఏమైనా వున్నాయా?" అని అడిగింది.

"సరిగ్గా వినలేదు" అంది ప్రియంవద. ఇంతలో టేప్‌నుంచి తన భర్తగొంతు లక్ష్మిగొంతు వినబడగానే ఉలిక్కిపడింది.

"ఆరేడు నెలలు కావొస్తూంది"

"............"

"అలాటి లెఖ్ఖ ఏదీలేదు. రెండోనెల అనుకుంటా"

ఆ సంభాషణ అర్థంకాక—ఆమె ఆలోచనల్లో ఉండగానే, ఆమె ఫ్రెండు ఆ క్యాసెట్ తీసేసి రెండోది పెట్టింది. మధ్యలో ఆగిపోయిన సంభాషణ కొనసాగినట్టూ ఆ రెండోదానిలో మాటలున్నాయి. అయితే ఈసారి భర్తగొంతుఒక్కటే వినబడింది.

"ఎంతకాలమయింది మీ పెళ్ళయి" అంతే తనెవరితో మాట్లాడాడో అందులో సమాధానం లేదు. మళ్ళీ అతడిప్రశ్నే వినబడింది. "....ఎన్నోనెల?"

ఆమెకు చప్పున ఏదో అర్థమయింది. దాంతో మంచు విడిపోయినట్టు అంతా విడిపోసాగింది. తన భర్త మాయమవటానికి ముందుక్షణం టేప్‌రికార్డర్లు పెట్టుకుని పనిచెయ్యటం — ఎవరో ఇద్దరు వ్యక్తులు రావటం - అతడు వెళ్ళిపోవటం—తరువాత రామ్మోహనరావు రావటం, క్యాసెట్ తీసుకెళ్ళటం - హారిక అప్పట్నుంచే ముభావంగా వుండటం - గాంధీ ప్రసక్తి వచ్చినప్పుడల్లా విరాసక్తత చూపించటం- దీని వెనుకవున్న కారణం అంతా అర్థమయి చటుక్కున లేచినిలబడింది.

క్యాసెట్లు రెండూ తీసుకుని బైటకు పరుగెత్తుతున్న ప్రియంవద వైపు ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది ఆమె స్నేహితురాలు.

రోడ్డుమీద కూడా ఆటోస్టాండ్‌వరకూ దాదాపు పరుగెడ్తూనే వుంది ప్రియంవద. ఈ అపార్థాన్ని ఎలాగైనా తొలగించాలి. పందెం గడువులోపలే అది జరగాలి. హారిక మొహంలో తిరిగి నవ్వు కనిపించాలి. తనపట్ల వాళ్ళకి ఏ చెడు అభిప్రాయమైనా వుండనీ - ఆ జంటకి ఈ మాత్రం సాయం చెయ్యగలిగితే ఈ గడ్డిపువ్వుకి ఓ సార్థకత ఏర్పడుతుంది. కైక జటాయువు అవుతుంది. తన భర్త వాళ్ళకి చేసిన ద్రోహానికి తను ఋణం తీర్చుకున్నట్టూ అవుతుంది.




ఆమె రామ్మోహనరావు ఇంటికి చేరుకునేసరికి నాలుగున్నర అయింది. ఆమె ఆ ఇంట్లో కొంతకాలం వుంది కాబట్టి అక్కడి నౌకర్లు ఆమెకి తెలుసు. వాళ్ళు ఇంటికి రంగులు వేయటం అప్పుడే ప్రారంభించారు.

"అయ్యగారు అమ్మాయితోకలిసి దేశం వదిలి వెళ్ళిపోయారుగా! ఈ ఇల్లు అమ్మేసేరు" అన్నారు. ఆమె కట్రాట్ అయింది. బాధ్యత మరింత పెరిగినట్టుగుర్తించి - విషయం తెలుసుకుని విమానాశ్రయానికి పరుగెత్తింది.

○○ ○○ ○●

"మాకీ సాయం చెయ్యండి సాబ్. మీ రుణం వుంచుకోము" అన్నాడు త్రివేది. గాంధీకి ఆశ్చర్యంగా వుంది. దాన్ని అణుచుకుంటూ "నేనేం చెయ్యగలను" అన్నాడు.

"అలా అనకండి. మీకెంత పలుకుబడి వుందో - ప్రైమ్మినిస్టర్ దగ్గిర మీరెంత చనువుతో వుంటారో మాకు తెలుసు" అన్నాడు ఫెర్నాండెజ్. వార్తలు ఎంత తొందరగా పాకిపోతాయా అనుకుంటూ తలెత్తిచూసేడు గాంధీ. వీళ్ళిద్దరేనా ఒకప్పుడు తనని నల్లినలిపినట్టు నలిపి పారేద్దామని టి.ఎఫ్.టి. కంపెనీ



పెట్టింది? వీళ్ళేనా అప్పటి తన అమా యకత్వం మీదా - అజ్ఞానం మీదా ఆడు కున్నది? తన భావాల్ని తనలోనే అణచుకుంటూ -

"ఏం కావాలి మీకు?" అని అడిగాడు.

ఫెర్నాండెజ్ ఆశగా తలెత్తాడు. "శివకైలాష్ బ్యాంకు డైరెక్టరు పదవి ఖాళీ అయింది కదా. రామ్మోహనరావుని తీసేసేరు. ఆ పదవి త్రివేదికి వచ్చేట్టు కాస్త చూడాలి"

"మరి మీకేం కావాలి?" గాంధీ అడిగాడు.

త్రివేది అందుకుని, రామ్మోహనరావు పేపరు మిల్లు ఇప్పుడు గవర్న మెంటు చూస్తుంది కదా సాబ్. ఆ వేలం పాటలో ఎలాగైనా దాన్ని ఫెర్నాండె జుకు వచ్చేట్టు చెయ్యాలి" అంటూ నవ్వేడు.

మూడు రాబందులు చచ్చిన ఎద్దు మాంసాన్ని తింటూ వుంటాయి. అందులో ఒక రాబందు గొంతులో ఎముక ఇరుక్కుని అది చస్తుంది. మిగతా రెండు రాబందులూ ఎండిన ఎద్దుని వదిలేసి తమ తోటి రాబందు మాంసంకోసం ఎగబడతాయి. అలాటి పక్షుల్లా కనబడ్డారు తన ముందు కూర్చున్న ఇద్దరూ!

మంచో చెడో - ముగ్గురూ కలిసి ఇంతకాలం కొన్ని పనులు చేసారు. ఇప్పుడు రామ్మోహనరావు పతనం అయ్యేసరికి - అతడిని వదిలేసి తనవెంట పడుతున్నారు.... నిజంగా బిజినెస్ మెన్ అంటే వీళ్ళు!!

గాంధీ ఆలోచనలను మరోలా అర్థం చేసుకున్న త్రివేది "-మీరు మమ్మల్ని క్షమించాలి సాబ్...." అన్నాడు. అప్పుడు నేను రామ్మోహనరావుకి చెప్పాను. 'ఈ కుర్రవాడు చాలా చిన్నవాడు. అమాయకుడు.... నీ బిజినెస్ టాక్టిక్స్ అన్నీ అతడిమీద ప్రయోగించి పాపం అతడిని నాశనం చెయ్యకు' అని. వినలేదు అతడు. దేముడున్నాడు సాబ్. అతడెప్పుడూ మీలాటి మంచివాళ్ళని కాపాడు తూనే వుంటాడు. ఆ రామ్మోహనరావు చేసిన పనిలో మేమూ ఉన్నందుకు ఆ తరువాత ఎంత బాధపడ్డామో మాకే తెలీదు. ఏదిఏమైనా మీరు ఈ రోజు ఈ పొజిషన్‌కు వచ్చినందుకు మాకు చాలా సంతోషంగా వుంది. పాతవైరాలు మర్చి పోండి. అదే మేము కోరేది"

గాంధీ ఓ క్షణం ఆగి, అన్నాడు "మీరు చెప్పింది బాగానే వుంది కానీ నేనూ వ్యాపారస్తుణ్ణే. మీకు ఈ రెండు సహాయాలూ చెయ్యగలను. దానికి నాకు దొరికే ప్రతిఫలం ఏమిటి ?" అన్నాడు.

అతడంత డైరెక్టుగా అడుగుతాడని వూహించని ఇద్దరూ బిత్తరపోయారు. ఫెర్నాండెజ్ చప్పున తేరుకుని, నవ్వుతూ, "మీ ఋణం వుంచుకోం. మీరు వూహించని విషయాన్ని ఋజువుల్తో సహా బైట పెట్టి మిమ్మల్ని ఆనందింప జేస్తాం" అన్నాడు.

"ఏమిటి అంత నేను వూహించని విషయం ?"

"మా పన్లు...." నసిగేడు త్రివేది. అంత అవసరార్థం వచ్చి కూడా పట్టు దొరికేసరికి వదిలిపెట్టని అతడి వ్యాపార దక్షతకి ఆశ్చర్యపోతూనే "చేస్తాను" అన్నాడు గాంధీ.

ఫెర్నాండెజ్ బ్రీఫ్‌కేస్‌లోంచి కాగితాలు తీసి గాంధీ ముందు పెడ్తూ, "ఇవిగో సార్ పేపర్లు. భారత ప్రభుత్వాన్ని మోసం చేసి స్విస్ బ్యాంక్‌లో రామ్మోహనరావు డబ్బు దాచుకున్నట్టూ బైట పెట్టే పత్రాలు. చాలా కష్టపడి సంపాదించగల్గేం. వీటిని మీరు ప్రభుత్వానికి వెంటనే అందజేస్తే అతడి 'వీసా' కాన్సిల్ చేయబడుతుంది" అన్నాడు.

గాంధీ నిరాసక్తంగా వాటి వైపు చూస్తూ "అతడి వీసా నేనెందుకు కాన్సిల్ చేయించటం ? దానివల్ల నాకొచ్చే లాభం ఏమిటి?" అని అడిగాడు.

"అదేమిటి సాబ్ ! మీతో పందెం కాసి ఆ గడువు లోపలే అతడు పారి పోతూవుంటే - అతడిని ఆపు చెయ్యొద్దా !" అన్నాడు త్రివేది.

అది షాక్ ! ! ! ఒక్కసారి గది కంపించినట్టయింది.

గాంధీ తను వింటున్న మాటల్ని నమ్మలేకపోయాడు. రామ్మోహనరావు పారిపోతున్నాడా.... గడువు లోపలే.... అంటే.... అంటే ఈరోజు సాయంత్రం లోపలే.... మరి.... మరి.... హారిక ఏమైంది ?... అతడి ఎదలో హోరు ప్రారంభమయింది. తనకు తెలియకుండానే తన వెనక ఇంత ప్లాన్ వేసాడా రామ్మోహనరావు....! దీన్ని .... దీన్ని ఎలాగైనా ఆపు చెయ్యాలి. అతడి పిడి




కిళ్లు అప్రయత్నంగా బిగుసుకున్నాయి.

గాంధీ మొహంలో మారుతున్న భావాల్ని చూసి, తాము కొట్టవలసిన చోటే కొట్టేము అనుకున్నారు త్రివేదీ ఫెర్నాండెజ్‌లు. రామ్మోహన రావు పలాయనం విషయం గాంధీకి ఇంతవరకూ తెలియదన్న విషయం వారికి విస్మయంతోపాటూ ఆనందాన్నీ కలుగజేసింది. ఇక తమ పనులు నెరవేరినట్టే. గాంధీకి తాము చేసిన సాయం తక్కువదేమీ కాదు. ఆ మాటే గాంధీ కూడా అన్నాడు.

"చాలా సంతోషం త్రివేదీ సాబ్. ఈ విషయాన్ని ఇంత కష్టపడి ఆధారాల్తో సహా నా వరకూ తీసుకొచ్చినందుకు నేను ఎప్పుడూ మీకు ఋణపడి వుంటాను. కానీ విచారకరమైన సంగతేమిటంటే నేను ఈ సాయత్రం రామ్మోహనరావు దేశాన్నివదిలి వెళ్ళిపోకుండా ఆపి సాధించగలిగేది ఏమీ లేదు"

"అదేమిటి సాబ్.... ఎందుకు ?"

"ఎందుకంటే నేను పందెం షరతు



ప్రకారం యాభై లక్షలూ సంపాదించలేక పోయాను కాబట్టి"

ఒక్కసారిగా ఆ గదిలో చీమ చిటుక్కుమంటే వినబడేటంత నిశ్శబ్దం అలుముకుంది దాన్ని ఛేదిస్తూ గాంధీయే మళ్ళీ అన్నాడు. "పందెం మొత్తానికి లక్షా యాభై వేలు తక్కువ వచ్చినయ్ అదికూడా సమకూరిన పక్షంలో కదిలే విమానం నుంచైనా రామ్మోహనరావుని క్రిందికి లాగుతాను. కానీ ఇప్పుడెలా - టైమ్ సరిగ్గా గంట కూడా లేదే-" అని, ఏదో స్ఫురించినట్టూ మధ్యలో మాటలు ఆపి వారివైపు చూసేడు, చూసి నవ్వేడు. "మీకు నేను చేయబోయే ఆ రెండు సహాయాలకుగానూ మిమ్మల్ని నేనా లక్షా యాభై వేలు అడగొచ్చు. కానీ అది చట్టబద్ధం కాదు. మా పందెం చట్టబద్ధంగా డబ్బు సంపాదించాలనే తప్ప లంచం తీసుకోకూడదు"

శ్రోతలిద్దరూ తేలిగ్గా వూపిరి పీల్చుకున్నారు. అతడెగానీ ఆ మొత్తాన్ని అడిగివుంటే వాళ్ళిద్దరూ ఇరుకున పడివుండేవారే. ఎందుకంటే ఆ రెండు పనుల ఖరీదూ (బ్యాంకు డైరెక్టరు పదవీ + మిల్లు వేలంపాట నెగ్గటానికి అయ్యేఖర్చు) కలిపి లక్షా యాభై వేలు చెయ్యదు.

తమని గాంధి ఇబ్బందిలో పెట్టలేదన్న సంతోషంతో త్రివేది "కావాలంటే ఆ డబ్బు నేను అప్పుగా ఇస్తాను సాబ్" అన్నాడు.

"ఎలా - సాయంత్రంలోపులో అంత డబ్బు ఎక్కడ దొరుకుతుంది. బ్యాంకులు మూసేసారుగా"

త్రివేది కుర్చీలోంచి లేచి, "మీరింక ఈ విషయం గురించి ఆలోచించకండి సాబ్.... మా పరపతి గురించి మీకు తెలీదు. నేనిప్పుడే వెళ్ళి కావల్సిన డబ్బూ - ప్రామిసరీనోటూ తెస్తాను" అన్నాడు. అంత హడావుడిలోనూ అతడు ప్రామిసరీనోటు గురించి మర్చిపోలేదు.

"ప్రామిసరీ నోటు అంటే జ్ఞాపకం వచ్చింది. మా పందెంలో షరతు ప్రకారం నేను యాభై లక్షలూ సంపాదించాలే తప్ప అప్పు తీసుకోకూడదు...." అన్నాడు గాంధీ.

"ఈ విషయం రామ్మోహనరావుకి తెలియవలసిన అవసరం లేదుగా"




"క్షమించండి. అలాటి మోసం నేను చెయ్యను".

గదిలో తిరిగి నిశ్శబ్దం అలుముకుంది. పందెం ఓడిపోబోతూన్న గాంధీని తమ పనులు చెయ్యమని మరోసారి అడగటం ఎలా అని ఆలోచిస్తున్నారు ఇద్దరూ. అంతలో ఏదో ఆలోచన స్ఫురించినట్టు గాంధీ "ఒకలా చేస్తే బావు టుంది" అన్నాడు. ఇద్దరూ ఆతృతగా ముందుకు వంగే .

"నా పేపరు మిల్లు తాలూకు షేర్లు అమ్మేస్తే...." తనలో తనే అనుకుం టున్నట్టు అని, "మీకు తెలుసుగా దండకారణ్య ప్రాంతంలో నాకో పేపరు మిల్లు వుందని. అసలు దాంతోనే నేనింత పైకి రాగలిగాను. ఆ మిల్లు అంటే నాకెంతో ఇష్టం. కానీ తప్పదు-నా జీవితంలో అన్నిటికన్నా ముఖ్యం ఈ పందెం నెగ్గటం.... దాని కోసం సర్వం కోల్పోయినా పరేదు...." అన్నాడు ఆవేశంగా. ఆ ఆవేశంలో కొద్దిగా విషాదం కూడా మిళితమై వుంది.

అతడు మాట్లాడుతూనే వున్నాడు. ఫెర్నాండెజ్ ఆలోచిచటం మొదలు

రెండు జెళ్ళ సీత
జంధ్యాల కేశవరావు




పెట్టాడు. ఈమిల్లు తను కొనేస్తే దీంతో పాటూ రామ్మోహనరావుది కూడా తనది అవుతుంది, కాబట్టి- పేపరు పరిశ్రమలో మకుటంలేని మహారాజులా వెలగొచ్చు. కాని తన ఆత్రుత బయటపెట్టకూడదు........ గాంధీ ఎలాగూ డబ్బు తొందర్లో వున్నాడు. అందులోనూ అయిదింటి లోపులో కావాలి డబ్బు. తాము కొద్దిగా బింకంగా వుంటే అతడే దిగి వస్తాడు. షేర్లు చీప్‌గా కొట్టెయ్యొచ్చు.

ఫెర్నాండెజ్ ఆలోచించినట్టే గాంధీ ఆత్రంగా "ఆషేర్లు మీరు కొనుక్కుంటారా? లక్షా యాభై వేల షేర్లు 'ఎట్‌పార్' ఇచ్చేస్తాను" అన్నాడు గాంధీ ఏమీ ఆలోచించలేదు. చాలా కష్టపడి పెట్టిన మిల్లు అది అయినా ఇప్పుడు అవసరం దాన్ని గెలుస్తూంది. వొకప్పుడయితే ప్రాణం పోయినా దాన్ని వదులుకొనే వాడు కాదు.

శ్రోతలు ఇద్దరూ వూపిరి బిగపట్టారు. ఆనందాన్ని బైటికి కనిపించనివ్వలేదు మార్కెట్టులో దానివిలువ మూడులక్షల దాకా వుంది. పందెం గెలవాలనే తొందర పాటులో ఇతడున్నాడు. ఈ కుర్రవాడికి ఇంకా వ్యాపారపు మెలకువలు తెలియలేదు.

త్రివేది మర్యాద, నెమ్మదితనం నిండిన కంఠంతో- "మీరింత చెప్పాలా సార్- తప్పకుండా కొనుక్కుంటాం. ధర దేముంది- అని మళ్ళీ గాంధీ మనసు మార్చుకునేలోపులో ఫోన్ దగ్గరికి లాక్కొని తన బాంకర్‌కి ఫోన్ చేసేడు.

సరిగ్గా అయిదు నిముషాల్లో రాతకోతలు పూర్తయ్యాయి. విద్యార్థి సంతకం పెట్టిన పవర్ ఆఫ్ అటార్నిని గాంధివారికి అందజేసి, షేర్లు అమ్మేసేడు, ఫెర్నాండజ్ లక్షా యాభైవేలు కాష్ గాంధికి అందజేసేడు.

అందరూ కరచాలనాలు చేసుకున్నారు. "కంగ్రాట్యులేషన్స్ సాబ్ మీరు పందెం గెలిచారు".

"థ్యాంక్యూ" అన్నాడు గాంధి. అతడి మొహం ఆనందంతో వెలిగిపోతూంది. అదే అవకాశంగా "మా పస్లు" అంటూ నసిగేడు త్రివేది.

"తప్పకుండా చూసిపెడ్తాను".

ఇద్దరూ బ్రీఫ్‌కేసులు తీసుకుని బైటకొచ్చి కారు ఎక్కారు.

వాళ్లు వెళ్ళిపోయాక గాంధి కవర్లు తీసుకొని వొక వాక్యం వ్రాసి పోస్టు చెయ్యమని సెక్రటరీ కిచ్చాడు.


"మమ్మీ, ఈ దురద,
మంటను ఎలాగైనా ఆపవూ."
నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే,
చెమటకాయల పౌడర్.
Glaxo
2 రకాల డబ్బీలలో దొరుకుతుంది. 'నీలం' మరియు 'చందనం.'
Glaxo nycil PRICKLY HEAT POWDER
నైసిల్
తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.
ఔషధ యుక్త-నైసిల్
1. అధిక మైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.
CASGLN-4-182 TEL

'ఈ సాయంత్రం మనకి గొప్ప అదృష్టం తెచ్చిపెట్టింది' అన్నాడు త్రివేది కార్లో ఫెర్నాండస్‌తో.

"ఈమాట ఎక్కడా పైకి అనకు. ఆ కుర్రవాడి అవసరాన్ని మనం ఇలా ఉపయోగించుకున్నామని అతడికి ఎవరైనా నూరిపోస్తే, మళ్ళీ మన పనులు చెయ్యడు' అన్నాడు ఫెర్నాండజ్.

వాళ్ళు ఇళ్ళకి చేరుకొనేసరికి ఆ సాయంత్రం తాలూకు దినపత్రికవచ్చింది. 'కాగితానికి' లెవీ పెడుతున్నట్టు రాష్ట్రపతి ఆర్డినెన్సు జారీచేసినవార్త ఆన్యూస్‌లో వచ్చింది. దాంతో కంట్రోలు ధరకి పేపరుని అమ్మలేని మిల్లుల షేరుధరలు రాత్రికిరాత్రి సగానికి సగం పడిపోయినయ్. ఆ మరుసటిరోజు, సోల్ సెల్లింగ్ ఏజెన్సీలు రద్దుచేయబడుతున్నట్టూ ప్రభుత్వం ఉత్తర్వు ఇచ్చింది ఆ వార్త కూడా బైటకురాగానే పదిరూపాయల షేరు రెండున్నర అయింది లక్ష యాభై"లకు కొనుక్కున్న షేర్ల ధర నలభై వేలకు పడిపోయింది. రెండ్రోజుల్లో ఫెర్నాండజ్, త్రివేదీలకి లక్షపైగా నష్టం వచ్చింది. మూడోరోజు ఇద్దరికీ పోస్టులో చెరొక కవరూ వచ్చింది అందులో ఒకే ఒక వాక్యం ఉంది.

'టి.ఎఫ్.టి. అంటే టిట్ ఫర్ టాట్'

oo oo oo

ఆమెకు విమానాశ్రయం కొత్త. గేటు దగ్గర టిక్కెట్టు కొనుక్కోవాలని చెప్పారు. కౌంటర్ దగ్గిరకివెళ్ళి కొనుక్కొని, లోపలికి ప్రవేశించింది. విమానం ఎన్ని గంటలకో ఆమెకి తెలీదు. వాళ్లు ఉన్నారో వెళ్ళిపోయారో కూడా అనుమానమే. రెండు మూడు చోట్లకి వెళ్ళే విమానాలు వచ్చే సమయం అవటం వల్ల ఆ హాలు కిటకిటలాడుతూవుంది. అదృష్టవశాత్తూ ఆమెకు వాళ్లు కనబడ్డారు. ఒక మూల ఆయన కూర్చొనివున్నాడు. కొంచం దూరంలో హారిక బుక్‌స్టాల్ దగ్గర నిలబడివుంది.

అంత ఆతృతలోనూ ఆమె మనసు చివుక్కుమంది. ఎప్పుడూ ఎంతో మంది చుట్టూ వుండగా మధ్యలో ఒక అధిపతిలా వెలిగే రామ్మోహనరావు, ఇప్పుడో బికారిలా - బిక్కుబిక్కుమంటూ ఒకమూల ఒక్కడే కూర్చొని వున్నాడు.

అతడుకూడా ఆమెని అదే క్షణంలో చూసేడు. పాతపరిచయంతో గొడవ చేయటానికి వచ్చిందేమో అని భయపడ్డాడు. ప్రియంవద మాత్రం హారిక దగ్గరకు వెళ్ళింది. ఆమె దాదాపు రొప్పుతూవుంది. ఏదో చెప్పాలన్న ఆవేశంలో ఎలా మొదలుపెట్టాలో తెలియలేదు.

"నేనూ ... నేనూ ..." అంది. "నేను మీతో కొద్దిగా మాట్లాడాలి".

హారిక విస్మయం చెందినా, దాన్ని బైటకి ప్రకటించకుండా "ఏమిటి" అంది. ప్రియంవద చెప్పడం ప్రారంభించింది. ఆమె ఒకసారి మాట్లాడటం ప్రారంభించగానే మాటలు వాటంతట అవే వచ్చినయ్.

"మీరు అనుకుంటున్నదంతా తప్పు. లక్ష్మికీ గాంధీకి మీరనుకునే సంబంధం ఏమీలేదు. అంతా మా ఆయనచేసినది. దానికి సాక్ష్యాలు ఇవిగో - ఈ టేపులు....ఏదో మాట్లాడి - దానికి వేరే అర్థాలు కల్పించాడు. లక్ష్మి గర్భవతి కాదు.... కేవలం మీ మనసు విరిచెయ్యటానికే ఈ ప్లాను వెయ్యబడింది." అంటూ తనమాటలు అసలు ఆమెకి అర్థమయ్యాయా లేదా అన్న అనుమానంతో ఆమెకేసి చూసింది. కానీ హారిక మొహంలో కొత్త విషయం వింటున్నఆశ్చర్యం ఏమీ కనపడలేదు. నవ్వుతూనే, "ఈ విషయం నాకు తెలీదని నువ్వెందుకు అనుకుంటున్నావ్?" అంది.

ఈసారి ఆశ్చర్యపోవటం ప్రియంవద వంతయింది. ఆమె విశ్చేష్టురాలై "అంటే" అంది.

"గాంధీ పెళ్ళిచేసుకోకుండా ఒకమ్మాయిని మోసం చేస్తాడంటే నేను నమ్మను, టేపు విన్నప్పుడు నేను కంగారుపడినమాట నిజమే. కానీ నవలానాయికలా అపార్థంతో నేనేమీ మనసు పాడుచేసుకోలేదు. సరిగ్గా ఒక గంట ఎంక్వయిరీలో లక్ష్మి - గాంధీల స్నేహపు స్వచ్ఛత బయటపడింది".

"మరి గాంధీమీద మనసు విరిగిపోకపోతే ఇలా అతడి నుంచి దూరంగా వెళ్ళిపోవటం దేనికి....?"

"నా ఆ ఎంక్వయిరీ ఒకగంటతోనే ఆగిపోలేదు కాబట్టి" అంది హారిక. ఈసారి ఆమె నవ్వులో రవ్వంత విషాద. తొంగిచూసింది.



ప్రియంవదకి ఏమీ అర్థంకాలేదు.

"అంటే" అంది అయోమయంగా.

"వెళ్ళిరా ప్రియంవదా! అర్థం చేసుకోగలిగితే అమాత్రం చాలు. శ్రమ తీసుకున్నందుకు నీకు నా కృతజ్ఞతలు" అని అక్కణ్ణుంచి తండ్రి దగ్గిరకు వెళ్ళిపోయింది హారిక. ఏం చెయ్యాలో తోచక ప్రియంవద అక్కడే ఒక క్షణం తటపటాయించి. అక్కణ్ణుంచి బైటకొచ్చేసింది.

బయల్దేరబోయే విమానం గురించిన ప్రకటన ఏదో మైకులో వస్తూంది.

o o o o

"మే ఐ కమిన్ సర్"

"ప్లీజ్ కమిన్"

సెక్రటరీ లోపలకి వచ్చింది. గాంధీ మొహాన్ని చూడగానే ఆ అమ్మాయికి అర్థమయిపోయింది. గాంధీ నవ్వి "గెల్చాం" అన్నాడు. ఒకేమాట.

ఆ అమ్మాయి కూడా నవ్వి "ఆఫీసులో అందరికీ తెలిసిపోయింది సార్" అంది. గాంధీ ఆశ్చర్యంతో 'ఎలా' అని అడిగాడు.

'మార్వాడీ వాళ్లు రావటం, బ్యాంకుకి ఫోన్ చెయ్యటం-'

'మనవాళ్లు నాకన్నా తెలివైనవాళ్ళలా వున్నారే...." అని ఆగి "అందరూ ఇళ్ళకి వెళ్ళిపోండి. యు ఆల్ సెలబ్రేట్" అన్నాడు గాంధి. "రేపు కూడా రానక్కర్లేదు"-

"ఎందుకు?"

"ఫిఫ్త్ ఆన్యువల్ క్లోజింగ్ డే...." అంటూ మళ్ళీ నవ్వేడు. అతడికి చిన్న పిల్లాడిలా గెంతాలని అనిపిస్తూంది. ఆమె తలుపు దగ్గరికి వెళ్తూవుండగా 'మాట' అన్నాడు.

ఆ అమ్మాయి దగ్గిరకొచ్చింది.

"నీ బోయ్‌ఫ్రెండ్ పేరేమిటి? ... లేదని బూకాయించక బస్ స్టాపుల్లోను, సినిమా హాల్లోనూ మోచేతుల్దాకా మడతపెట్టుకునే అబ్బాయిని నీతోపాటూ చాలా సార్లు చూసేను" అన్నాడు.

ఆ అమ్మాయి కొద్దిగా సిగ్గుపడి "జేమ్స్" అంది. గాంధి డ్రాయర్‌లోంచి

కాంప్లిమెంట్ ఒకటి తీసేడు. అదో కొత్త రిస్టువాచి. "అమ్మాయిలికిచ్చే ప్రెజెంటేషన్లు అబ్బాయిలకి గొప్ప థ్రిల్లు కలగజేస్తాయి. పోతే పెళ్ళి రోజు వరకూ దీన్ని పెట్టుకోకూడదని షరతుపెట్టు.... బెస్ట్ ఆఫ్ లక్" అన్నాడు.

ఆ అమ్మాయి బెదిరి "ఇదెందుకు సార్" అంది మొహమాటంగా

"నా బాధకి నీ కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లినందుకు" -పైకి అనకుండా చేతి ముందుకు సాచేడు. ఆ అమ్మాయి సిగ్గుతో దాన్ని అందుకుని "థ్యాంక్స్ సార్! వెరీ మెనీ థ్యాంక్స్...." అనేసి బైటకు పరుగెత్తింది.

అంతలో కరెంట్ పోయినట్టుంది. ఎయిర్ కండిషనర్ చప్పుడు ఆగిపోయింది. అప్పుడే అందరూ వెళ్ళిపోయినట్టున్నారు. చౌకీదారు వెనకవైపు తలుపులు వేసేస్తున్నాడు. గాంధీ బ్రీఫ్‌కేస్ తెరిచాడు. చౌకీదారు అయిదు కొవ్వొత్తులున్న స్టాండు తీసుకొచ్చి బల్లమీద పెట్టి వెళ్ళిపోయాడు. గది వెలుగుతో నిండింది. గాంధీ పెదవుల నుంచి సన్నగా హమ్మింగ్ వస్తూంది. ఎప్పుడూ లేనిది అది కొత్తగా వుంది. అతడెంతో రిలాక్స్‌డ్‌గా వున్నాడు. బ్రీఫ్‌కేస్‌లో మరో మారు లెక్క చూసుకున్నాడు. దాన్ని తీసుకొని కుర్చీలోంచి లేవబోతూ వుంటే ధడేలున తలుపులు తెరుచుకున్నాయ్ మెట్లు ఎక్కి వచ్చిన ఆయాసంతో విద్యార్థి రొప్పుతున్నాడు. అతడి కళ్ళు ఎర్రగా వున్నాయి. జుట్టు చెదిరిపోయి వుంది. అతడు లోపలికి రాలేదు. మూసుకున్న తలుపులకి చేతులు ఆన్చి నిలబడి వున్నాడు. గాంధీ మనసు కీడు శంకించింది.

మామూలు భావాలన్నిటికీ అతీతమైన నిర్లిప్తతతో అతడన్నాడు- "అయిపోయింది గాంధి.... లక్ష్మి మనల్ని వదిలేసి వెళ్ళిపోయింది".

బాణం తగిలి ఒక పక్షి నిస్సహాయంగా నేల వాలిపోతే మిగతా పక్షులన్నీ రెక్కలు టపటపా కొట్టుకుంటూ ఒక్కసారిగా లేచిపోయాక- మిగిలిన ఒంటరి చెట్టు, దాని చుట్టూ భయంకరంగా పేరిన నీరవం.... రెక్కల సందుల్లోంచి ప్రాణాలు వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ పెట్టేబాధకు మూసుకుపోతున్న కనురెప్పనుంచి నిశ్శబ్దంగా రాలిన ఆఖరి కన్నీటిచుక్క.

నిశ్శబ్దాన్ని చీలుస్తూ పెద్ద శబ్దంతో అతడి చేతిలోంచి బ్రీఫ్‌కేస్ జారిపోయింది. డ్రాఫ్టులూ నోట్లూ చెల్లాచెదు



## రెండు జెళ్ళ సీత

జంధ్యాల

రయ్యాయి.

ఆ కాగితాలమధ్య శిలాప్రతిమలా నిలబడిపున్నాడు గాంధీ.

"ఆమెకు సరిగ్గా అరగంటముందు స్పృహ వచ్చింది. చావుముందు రాబోయే స్పృహ అట అది. నాకు తెలియలేదు. కళ్లు విప్పగానే ఆమె అడిగిన మొదటి ప్రశ్న ఏమిటో తెలుసా గాంధీ.... పంతొమ్మిదో తారీఖు ఇంకా ఎన్ని రోజులుందీ... అని! ఈ రోజే అని చెప్పాను. ఇన్నాళ్ళుగా చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టులాడేనా అని అన్లేదు. 'గాంధీ గెలిచాడా' అని అడిగింది.... వారం రోజులుగా ముంచుకొస్తున్న చావు తెస్తున్న నీరసంతో లక్ష్మి అడిగిన రెండో ప్రశ్న గాంధీ అది: అది కూడా నీ గురించే!! నువ్వు గెలిచావో లేదో నాకు తెలీదన్నాను. తనలా అనవసరంగా చావుబ్రతుకుల మధ్య వుండిపోయి నీ పందెపు ఆఖరి రోజుల్లో నీ అమూల్యమైన కాలాన్ని వేస్ట్ చేసేనేమో అని బాధపడింది!! పాపం నువ్విన్ని రోజులూ తన పక్కనే వున్నావనుకొంటూంది.... గాంధీ! లక్ష్మి ఇన్నాళ్ళూ నీతో గడిపినా నీ మెటీరియలిజం గురించి తెలుసుకోలేకపోయింది. నీ మనసులో ఏమూలో ఆర్ద్రతా అభిమానం వున్నాయని భ్రమపడింది. అలాటి అపోహలేమీ పెట్టుకోవద్దన్నాను ఇన్ని రోజుల్లో కనీసం వొక్కసారన్నా చూడటానికి వచ్చేటంత తీరికకూడా లేకుండా డబ్బు సంపాదనలో మునిగిపోయి వున్నాడు లక్ష్మి నీ ప్రియస్నేహితుడు- అని చెప్పేసరికి మాత్రం ఆమె కంటి నుంచి వేడి కన్నీటిచుక్క రాలింది. చాలా సేపు అలాగే కనులు మూసుకుని వుండి పోయింది. బహుశ మీఇద్దరి తొలిస్నేహపు రోజుల్ని, మొదటి రూపాయి సంపాదించటానికి పడిన కష్టాన్ని గుర్తు తెచ్చుకుందేమో! అయినా ఆమెలో కోపం నాకు కనబడలేదు గాంధీ! కేవలం నీ పట్ల వేదన కనబడిందంతే!! నెమ్మది నెమ్మదిగా మృత్యువు చేతులుసాచి దగ్గరకు తీసుకోవడం ఆమెకు తెలియవచ్చింది కాబోలు..... కనులు విప్పి చివరిసారిగా మాట్లాడింది. అది కూడా నీ గురించే. అప్పుడెప్పుడో రెండు సంవత్సరాల క్రితం తనకో వాచీ ప్రెసెంటేషన్ ఇచ్చావట రోజు తర్వాత రోజు గడిచి అయిదు సంవత్సరాల గడువు దగ్గరపడే టైమ్‌ని గుర్తు చెయ్యమని ఆమెకు దాన్ని ఇచ్చావట. అలా ఇవ్వటాన్ని తనెంతో థ్రిల్లింగ్‌గానూ అపురూపంగానూ ఫీలయ్యానని చెప్పమంటూ, ఆఖరి రోజుల్లో తన కర్తవ్యం నెరవేర్చలేనందుకు బాధపడుతూ ఇదిగో- దీన్ని తిరిగి నీకు ఇచ్చెయ్యమంది...." అంటూ వాచీని స్ట్రాపుతో సహా బల్లమీద పెట్టాడు.




గాంధీ ఏదో మాట్లాడబోయాడు. కానీ గొంతులో అడ్డుకున్నట్టూ నోట మాట రాలేదు. విద్యార్థి తలుపు తెరుస్తూ "అన్నట్టూ ఇంకో విషయం గాంధీ! ఎప్పుడో నీ పార్టనర్ ముసలమ్మ చచ్చిపోతే కాటికాపరికి డబ్బులిచ్చి అకౌంట్ సెటిల్ చేసేసుకున్నావట. నీతో అలా తెగతెంపులు చేసుకోవటం తనకిష్టం లేదు కాబట్టి ఆఖరి కోర్కెగా తను కోరిన కోరిక ఏమిటంటే తన చితి దగ్గరకు నువ్వు రానక్కర్లేదట. అయినా బ్రతికున్నంతకాలం రానివాడివి చచ్చాక ఏం వస్తావులే.... ఆనందపడు గాంధీ! నా చెల్లెలి చితి నేనే వెలిగిస్తాలే. నీ టైమ్ ఆదా అయినందుకు ఆనందపడు. ఈ కాస్త టైమ్‌లోనూ మరింత సంపాదించు, బెస్ట్ ఆఫ్ లక్....".

తలుపు పూర్తిగా తెరిచి వెళ్ళిపోతూ నెమ్మదిగా ఆఖరిమాట అన్నాడు. "ఇంతకాలం కేసటియా కలాగా నీ దగ్గర పని చేసేను. వెళ్ళిపోబోయేముందు




వొక్కమాట అనటానికి సాహసిస్తాను. గాంధీ. యు ఆర్ సన్ ఆఫ్ ఎ బిచ్" అతడి వెనుక తలుపు మూసుకుపోయింది. (ఇంకా వుంది)



వి. రాజారామమోహనరావు

జ్యోతి భాగ్యలక్ష్మి నవలల పోటీలో

ప్రథమ బహుమతిపొందిన రచయిత

పరిచయం :

వుంటున్నదీ, రైల్వే ఉద్యోగం చేస్తున్నదీ హైదరాబాదులో.... వయసు ముప్పైఏడేళ్లు.

నూటయాభై పైగా కథలు, అయిదు నవలలు...'వరద' కథల సంపుటి అచ్చయిన రచనలు....కొన్ని కథలు. ఓ నవల యితర భారతీయ భాషలలోకి అనువాదం అయ్యాయి. కథలకి జ్యోతి, స్వాతి, యువ, చక్రవర్తి, ఆంధ్రభూమి, ఆదివారం, ఆంధ్రజ్యోతి పత్రికలలో బహుమతులు వచ్చాయి. 'మనిషికీ మనిషికీ మధ్య'....నవలకి (విశాలాంధ్ర నవలల పోటీ) ప్రథమ బహుమతి, 'కొత్తచిగురు' నవలకి(నవభారత్ బుక్ హౌస్) టేలెంట్ పోటీ బహుమతి లభించాయి

సాంఘిక జీవితంలో నానాటికి పెరుగుతున్న క్రౌర్యం, అమానుషం.... వాటి విషయంలో ఉదాసీనత కూడదన్న భావన... యివి నా యీ నవలకి ప్రేరణ

ఎప్పటినుంచో జ్యోతి సంస్థ అందిస్తున్న ప్రోత్సాహం నేను ఎప్పటికీ మరువలేనిది.

# ఆ అనుభవం కావాలి!



వి. మోహన్‌కుమార్

స్వప్న త్వరగా పెళ్ళి చేసుకుంటే బాగుంటుందని కోరుకుంటాడు ఆనందరావు. ఆ విషయంలో సహాయం చెయ్యమని స్నేహితుడు పరబ్రహ్మాన్ని అడుగుతాడు. స్నేహితురాలు మాలతిని చూడ్డానికి వెళ్ళిన స్వప్నకి వింత పరిస్థితిలో ప్రశాంత్ ఎదురౌతాడు. మాలతి, ప్రణీత్‌ల అన్యోన్యతకి ముచ్చటపడుతుంది స్వప్న. స్వప్న ప్రశాంత్‌ని ఆకర్షిస్తుంది. స్వప్నని ఆకర్షించడానికి ప్రయత్నిస్తాడు ప్రశాంత్. స్వప్న కోటీశ్వరుడి కూతురని ప్రశాంత్‌కి చెప్తాడు ప్రణీత్.

- ఇక జరిగే కథ -

"సరే మీ సందేహం తీరుస్తాను. నన్ను స్వప్న పంపలేదు. మాలతి నాకు యీ సంగతి చెప్తే మిమ్మల్ని కలుసుకుని అనవసరమైన ఆశ పెట్టుకోవద్దని సలహా చెప్పడానికి నా అంతట నేనే వచ్చాను" ప్రణీత్ ముందుకి నడుస్తున్నాడు.

వెనక్కి తిరిగాడు ప్రశాంత్. కన్నీటిచుక్క కనుకొలను దాటి సర్రున జారింది.

గబ గబ ఇంట్లోకి వెళ్ళి దిండులో తలదూర్చి పడుకున్నాడు.

o o o o o o

సాయంత్రం అయిదు గంటలు.

ప్లాట్ ఫాం హడావుడిగా వుంది. ఆ ఊర్లో ఆగే నాలుగు రైళ్ళలో అది మూడోది.... నాలుగో రైలు రాత్రి ఉంది. అందువల్ల రైలు ఆగిన ఆ కాసేపట్లోనే తమ దగ్గరున్న వాటినన్నింటిని అమ్మేయాలన్న ఆతృత, అమ్మగలమన్న ధీమాతో కుర్రాళ్లు గట్టిగా అరుస్తూ ప్రతి కిటికీ దగ్గరకెళ్ళి అక్కడ కూచున్న వాళ్ళని పలకరిస్తూ అటూ ఇటూ పరుగెడుతున్నారు.






"మళ్ళీ ఎప్పుడు రాక" అడిగింది మాలతి.

"నువ్వు మా ఊరు వచ్చాక" అంది స్వప్న. ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంట్‌లో కిటికీ దగ్గర కూర్చుంది.

"నాతో వంతు పెట్టుకోకూడదమ్మా! చూడాలనిపించినప్పుడల్లా నువ్వో, నేనో ఎవరో ఒకరం బయల్దేరాలి" అంది మాలతి.

"కరెక్టు"

"ఏమండోయి, మీరు మా ఆవిడతో వంతు పెట్టుకోకండి. మీరు స్వేచ్ఛా విహంగం, మా ఆవిడ సంసారం అనే పంజరంలో బందింపబడ్డ చిలక. కాబట్టి మీరే వస్తూండండి. అయితే వచ్చేముందు ఏ రైల్లో వస్తున్నారో టెలిగ్రాం ఇవ్వండి. కనెక్టింగ్ రైలు తప్పిపోతే స్టేషన్లోంచే టెలిగ్రాం ఇవ్వండి" అన్నాడు ప్రణీత్.

"అది నేను మరోమారు వచ్చేటప్పటికి అందుతుంది" అంది స్వప్న.

అందరూ నవ్వారు.

"స్వప్నా నేనే ముందు మీ ఊరుకి

శ్రీభ్రమరాంబికా ఫిలింస్
రెండు జెళ్ళ సీత
జంధ్యాల కేశవరావు

రావాలంటే ఓ షరతు"

"ఏమిటది"

"నీ పెళ్ళి శుభలేఖ రావాలి"

"అచ్చా అలా అయితే నేను మళ్ళీ మీ ఊరు రావాలంటే నాకూ ఓ శుభలేఖ రావాలి"

"బాబోయ్.... ఆ కండిషన్ పెట్టకండి మా ఆవిడ మూడు నెలలకే పిల్లని కంటానంటుంది: పెళ్లయి ఆరు నెలలు కూడా రాలేదు. ఇంకొన్నాళ్లు పోనివ్వండి" ప్రణీత్ రెండు చేతులు ఎత్తిదణ్ణం పెట్టాడు.

ఇంతలో రైలు కూతేసింది.

"ఊరు వెళ్ళగానే ఉత్తరం రాయి" మాలతి సెలవు తీసుకుంది.

రైలు కదిలింది.

కిటికీలోంచి చూస్తూ చెయ్యి ఊపింది.

మాలతి ప్రణీత్‌లు చెయ్యి ఊపుతున్నారు. వాళ్లు కనుమరుగవడంతో చటుక్కున సీట్లోంచి లేచి కంపార్టుమెంటు తలుపు దగ్గర కెళ్లింది.

వాళ్ళని చూస్తూ చెయ్యి ఊపుతోంది. రైలు క్రమంగా ముందుకు పోతోంది. మాలతి, ప్రణీత్‌ల చేతులు అస్పష్టంగా కనిపిస్తున్నాయి రైలు ప్లాట్ ఫాం చివరకి వచ్చింది.

నవ్వుతూ చెయ్యూపుతున్న స్వప్న అక్కడ కనిపించిన వ్యక్తిని చూసి గతుక్కుమంది. ఒక్క క్షణం ఆమె గుండె వేగంగా కొట్టుకుంది. ఊగుతున్న ఆమె చెయ్యి అప్రయత్నంగా ఆగిపోయింది. ఆమె కళ్లు అతని కళ్ళని కలుసుకున్నాయి. క్షణంలో రైలు మరింత ముందు కెళ్ళింది.

చెయ్యెత్తి వీడ్కోలు చెప్పబోయిన అతను ధైర్యం చాలక ఆగిపోయాడు. సగం లేచిన చెయ్యి అలాగే ఉండి పోయింది. అతని కళ్లలో నీళ్లు తిరిగాయి. అతని కళ్ళలో నీళ్లు తిరగడం వెంటనే అతను రుమాలుతో తుడుచుకోడం చూసింది స్వప్న. మరు క్షణం కంట్లో నలుసు పడటంతో 'వెధవ నలుసు' అని తలుపు మూసేసి లోపలికి వెళ్ళి కూర్చుంది.



"ఇతనెవరోకాని నిజంగా పిచ్చివాడు" అనుకుంది స్వప్న. కనుమరుగవుతున్న రైలుని చూస్తూ ప్లాట్‌ఫాం చివరన అలాగే నించుండి పోయాడు ప్రశాంత్.

o o o o

ఆనందరావుగారి మేడ దీపాలకాంతిలో తళతళ మెరుస్తోంది. హాల్ కేకలతో, నవ్వులతో, సందడిగా వుంది. అందరిమధ్య నవ్వుతూ నించుంది స్వప్న. పసుపుపచ్చని చీర ఆమె శరీరపు రంగుతో పోటీపడుతోంది. ఇద్దరు బేరర్స్ ఓ పెద్ద కేక్‌ని తీసుకొచ్చి టేబుల్ మీద ఉంచారు. దానిమీద పంథొమ్మిది కొవ్వొత్తులు ఠీవిగా నిలబడి ఉన్నాయి. ఓ అమ్మాయి కొవ్వొత్తుల్ని వెలిగించింది.

స్నేహితురాళ్లు చెయ్యి పుచ్చుకుని నడిపిస్తూండగా మొహమాటంగా దాని దగ్గరికి నడిచింది స్వప్న.

తలెత్తి అందరివైపూ చూసి నవ్వింది.

తలవంచి ఆ కొవ్వొత్తుల్ని ఊదింది. చాకుతో కేకుని కోస్తోంది. ఆ దృశ్యాన్ని చూస్తున్న ఆనందరావు రుమాలుతో కన్నీళ్లు తుడుచుకుంటున్నాడు.

"హాపీ బర్త్‌డే టు యు బేబీ" పరబ్రహ్మం కేక వినిపించి చటుక్కున తలెత్తి చూసింది స్వప్న.

పరబ్రహ్మం హడావిడిగా స్వప్న దగ్గరికి చేరుకున్నాడు,

"అంకుల్ నా పుట్టినరోజుకి నువ్వు ఓ నిమిషం లేటు" అంది స్వప్న.

"కాదమ్మా వచ్చే పుట్టినరోజుకి మూడువందల అరవై నాలుగు రోజుల ఇరవై మూడు గంటల యాభై తొమ్మిది నిమిషాలు ముందు"అన్నాడు పరబ్రహ్మం అందరూ నవ్వారు.




పరబ్రహ్మం ఆనందరావు దగ్గర కెళ్లాడు.

"హాపీ బర్త్ డే టు యు........"
కొంత మంది అమ్మాయిలు పాడు




తున్నారు.

మిగిలిన వాళ్ళు పెదవులు కదుపుతున్నారు. ఆనందరావు, పరబ్రహ్మం శృతి కలిపారు.

"దీని తర్వాత డాబామీద మూన్‌లైట్ డిన్నర్" ఆనందరావు ఎనౌన్స్ చేశాడు.

అందరూ బిలబిలమంటూ డాబామీదకి బయల్దేరారు.

పరబ్రహ్మం, ఆనందరావు పక్క పక్కగా నడుస్తున్నారు. పరబ్రహ్మం పక్కకి చేరింది స్వప్న.

"వాళ్ళని చూడు" ఓ లావుపాటి జంటని చూపించాడు రబ్రహ్మం

స్వప్న, ఆనందరావు వాళ్ళని చూశారు.

"వాళ్ళది ఎవరూ విడదీయలేని అపూర్వమైన జంట. వాళ్లు కలీబడ్డారంటే విడదీయడానికి కనీసం నలుగురు కావాలి" అన్నాడు పరబ్రహ్మం.

స్వప్న కిసుక్కున నవ్వింది.

"ఒరేయ్ నీ కామెంట్స్ తగ్గించు. నీ కామెంట్ విని వాళ్ళిద్దరూ మన మీద కలీబడ్డారంటే విడ య్యడానికి

ఇక్కడున్న అందరూ చాలరు" అన్నాడు ఆనందరావు.

డాబామీద పున్నమి వెన్నెల్లో బఫే అందరికీ నచ్చింది.

కోలాహలం మధ్యలో ప్లేట్ల చప్పుడు నేపథ్య సంగీతంలా వినిపిస్తోంది.

"ఈరోజు స్వప్నతో మాట్లాడతాను" అన్నాడు పరబ్రహ్మం.

గుడ్, నేనూ అదే అడగబోతున్నాను" ఆనందరావు స్వప్న వంక చూస్తూ అన్నాడు,

స్వప్న స్నేహితురాళ్ళ మధ్య తుళ్ళుతూ తిరుగుతోంది.

స్వప్న పెళ్ళయితే తన బాధ్యత తీరినట్టవుతుంది. కాని ఆమె పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే ఇంట్లో ఈ సందడి, ఈ కోలాహలం- అన్నీ మాయమైపోతాయి. తను ఒంటరిగా మిగిలిపోతాడు. ఆనందరావు దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

తనక్కావలసింది స్వప్న సుఖ సంతోషాలు. ఆమె కాపురం చేసుకుంటూ పచ్చగా ఉంటే చాలు. తను ఒంటరిగా వున్నా పర్వాలేదు.

పార్టీ అయిపోయింది. ఒక్కొక్కరు వెడుతున్నారు. డాబా పలచబడింది. అందరికీ వీడ్కోలు చెప్పి ముగ్గురూ కిందకి దిగి హాల్లో కూర్చున్నారు.

"పరబ్రహ్మన్ని ఇక్కడే ఉండిపొమ్మన్నాను. రేపు ఉదయం బ్రేక్‌ఫాస్ట్ తీసుకుని వెడతాడు" అన్నాడు ఆనందరావు.

"వెరీగుడ్. అంకుల్ కథలు విని చాలా రోజులైంది. దెయ్యాలు, రాజకుమారుడి కథ మళ్లీ చెప్పు అంకుల్" చిన్నపిల్లలా అడిగింది స్వప్న.

"ఆ కథలు చిన్నప్పుడు చెప్పేవాణ్ణి. ఇప్పు కూడా అవేకథలా"

"అవే బాగుంటాయి"

"స మీరు కథలే చెప్పుకుంటారో కబుర్లే చెప్పుకుంటారో మీ ఇష్టం. నేను అలసిపోయాను. విశ్రాంతి తీసుకుంటాను. రేపు ఉదయం కలుద్దాం. గుడ్ నైట్" ఆనందరావు లేచాడు.

"గుడ్‌నైట్ డాడీ. హార్లిక్స్ కలిపి ఇమ్మంటారా"

"ఏదీ ఒద్దమ్మా. కాసేపు నిద్రపోతే చాలు. వస్తా"

ఆనందరావు ఆవలిస్తూ బెడ్‌రూం వైపు నడిచాడు.



"కథ చెప్పు అంకుల్" అడిగింది స్వప్న.

"ముందు కబుర్లు. తర్వాత కథ. నిన్ను ఓ విషయం అడుగుదామను కుంటున్నాను"

"ఓహో ఇంటర్వ్యూ చేస్తావా ? సరె అడుగు" గొంతు సవరించుకుని ఠీవిగా కూర్చుంది.

"జోక్ కాదు. సీరియస్"

"అలాగా. అయితే నేనూ సీరియస్" మామూలుగా అయిపోయింది.

"నాకు తెలిసిన ఓ మంచి కుర్రాడున్నాడు. చాకులాంటివాడు. అన్నివిధాల నీకు తగినవాడు. మీ ఇద్దరి జంట అపూర్వంగా ఉంటుంది"

"ఏదీ ఇందాక నువ్వు చూపించిన లావుపాటి జంటలాగా. అయితే మా ఇంట్లో ఎప్పుడూ కనీసం నలుగురుండాలి"

"అది కాదమ్మా. నన్ను మాట్లాడనీ. నిన్ను చూపిస్తే అతను ఎగిరి గంతే స్తాడు. కానీ తీరా నువ్వు కాదంటే...."

"చతికిలపడతాడు" నవ్వుని పెదాలమధ్య బిగబట్టి అంది స్వప్న.

"అదిగో అదే....జోక్ వద్దన్నానా. అతనికి నీ గురించి చెప్పే ముందు నీ ఉద్దేశం తెలుసుకుందామని. ఇంకా మీ నాన్నకూడా చెప్పలేదు. నీకు ఉద్దేశం ఉంటే అతనికి తెలియకుండా అతన్ని నీకు చూపిస్తాను. నువ్వు 'పర్వాలేదు' అంటే, అప్పుడు అతన్ని మన ఇంటికి రమ్మందాం. సరేనా"

"పెళ్ళి విషయంలో నాకో నిర్దుష్టమైన అభిప్రాయం ఉంది" స్వప్న సీరియస్‌గా అంది.

"చెప్పు"

"నేను నాకు మనస్ఫూర్తిగా నచ్చిన అబ్బాయినే చేసుకుందామనుకుంటున్నాను. అలాంటి వ్యక్తి తటస్థపడేంతవరకు ఎన్నాళ్ళయినా ఆగుతాను"

"మా అభిప్రాయం కూడా అదే. నువ్వు నీకు నచ్చిన అతన్నే చేసుకోవాలి. అయితే ఆ చేసుకునేదేదో తొందరగా చేసుకోవాలని మా ఆరాటం"

"అతను తటస్థపడాలి కదా"




"నువ్వు కళ్లు మూసుకుంటే తటస్థపడడు కదా. కళ్ళు తెరిచి చూస్తే కనిపించిన వాళ్ళలో ఎవరో ఒకరు నచ్చు




తారు. అయినా నువ్వు పెళ్ళి చేసుకోవల్సింది నువ్వు ఇష్టపడే వ్యక్తిని కాదు. నువ్వు ప్రేమించే వ్యక్తిని"

"అదేమిటి ఇష్టపడనివాడ్ని ఎవరేనా ప్రేమిస్తారా. నాకదేం ఖర్మ"

"ఇష్టపడ్డవాళ్ళని ప్రేమించలేకపోయిన సంఘటనలూ ఉన్నాయి. అలాగే ఇష్టపడని వాళ్ళని ప్రేమించిన సంఘటనలూ ఉన్నాయి"

"ప్రేమ, ఇష్టం - వీటికి తేడా వుందా"

"మామూలుగా తేడా లేనట్టే అనిపిస్తుంది. కాని ఉంది. లైకింగ్ - లవింగ్ రెండింటి మధ్య స్వల్ప తారతమ్యం ఉంది. వీటిని నిర్వచించడం కన్నా, ఆ భావాలు ఎలా ఉంటాయో చెప్పడం తేలిక. ఉదాహరణకి.

"ఇతను చాలా తెలివైనవాడు. ఏ పనేనా ఆలోచించి చేస్తాడు"

"ఇతను ఎప్పుడూ మాట తప్పడు - ఇతని మాటమీద నాకు పూర్తి నమ్మకం ఉంది."

"మా అభిప్రాయాలు చాలా వరకు ఒకటే"

ఇలాంటి భావాలు కలిగాయనుకో నువ్వుఅతనంటే ఇష్టపడుతున్నట్టులెక్క.

అలాగే —

"ఇతను లేకపోతే నాకు అసలు తోచదు. నేను ఇతన్ని విడిచి ఉండలేను"



"పాపం ఇతను ఏమీ చేసుకోలేడు. ఇతనికోసం నేను ఏమైనా చేస్తాను"

"ఇతను తొందరగా వస్తే బాగుండును. ఇతనికి చెప్పకుండా నేను దేన్నీ మనసులో దాచుకోలేను"

ఇలాంటి భావాలు కలగాయనుకో నువ్వు అతన్ని ప్రేమిస్తున్నట్టు లెక్క" స్వప్న వంక చూసాడు పరబ్రహ్మం.

ఏమీ అర్థం కానట్టుగా చూసింది స్వప్న.

"నీకు ఇంకా కన్ఫ్యూజన్‌గా ఉందా. మనం ఒక వ్యక్తిని చూసినప్పుడు ఆ వ్యక్తిని మనతో పోల్చుకుంటాం. అతను మనకన్నా ఎక్కువగా ఉన్నా లేక సమానంగా ఉన్నా అతన్ని మనకి తగిన వ్యక్తిగా భావిస్తాం. ఇష్టపడతాం. ఇష్టంలో ఇలా 'పోల్చడం' అనే ప్రక్రియ ఉంది. అయితే ప్రేమలో ఇలా పోల్చుకోడం ఉండదు. ఎక్కువ తక్కువ ఉండదు.

"నేను అతన్ని ప్రేమిస్తున్నాను. కారణం అతను నన్ను ప్రేమిస్తున్నాడు"

"నేను అతన్ని విడిచి ఉండలేను. కారణం అతను నన్ను విడిచి ఉండలేడు"

"నేను అతన్ని చూసి సంతోషపడతాను. కారణం అతను నన్ను చూసి సంతోషపడతాడు"

ప్రేమ భావాలు ఇలా ఉంటాయి. వీటికి ఒకటే లాజిక్.

"నాకు అతనిపట్ల ఈ భావం కలగడానికి కారణం అతనికీ నాపట్ల అలాంటి భావం కలగడమే"- ప్రేమకి ఇదే లాజిక్.

ఒకవేళ మన అంచనాలు తలక్రిందులై మనం ఇష్టపడ్డ వ్యక్తి మనకన్నా తక్కువ స్థితిలోకి జారిపోయినప్పుడు 'ఇష్టం' పోతుంది. కాని అంచనాలు తల్లకిందులైనా 'ప్రేమ' పోదు. ఎదుటివ్యక్తి మనల్ని ప్రేమించినంతకాలం మనం ఆ వ్యక్తిని ప్రేమిస్తూనే ఉంటాం. 'ఇష్టం' పర్‌ఫెక్షన్ని కోరుతుంది.




బలహీనతని నిరసిస్తుంది. ప్రేమ పర్‌ఫెక్షన్ని మెచ్చుకుంటుంది. బలహీనతని క్షమిస్తుంది. ఈ రెంటికీ ఉన్న సున్నితమైన తేడాని తెలుసుకోలేనివాళ్లు




ప్రేమలో దెబ్బతింటారు.

ఎదుటి వ్యక్తిలో కనిపించే ఏదో ఒక ప్రత్యేకతవల్ల కలిగిన ఆకర్షణని ఇష్టాన్ని ప్రేమ అనుకుని పొరపాటు పడతారు చాలామంది. ఆ వ్యక్తిలో ప్రత్యేకత లేదని తేలిపోయిన రోజు ఆకర్షణా, ఆ ఇష్టం అంతరించిపోతాయి. ఆశాభంగం కలుగుతుంది."

కాని ప్రేమించినవాళ్ళకి ఆ భయం లేదు.

"అబ్బ నువ్వు దీనిమీద చాలా రిసెర్చి చేశావే" అంది నవ్వుతూ.

"నేను కాదు. రూబిన్ అనే హార్వార్డ్ యూనివర్సిటీ సైకాలజిస్ట్ నూట ఎనభై రెండు జంటలమీద రిసెర్చి చేశాడు. ఆ రిసెర్చిలో తేలిన విషయం -- ఇష్టం. ప్రేమ ఈ రెంటి మధ్య తారతమ్యాల్ని స్త్రీలు గుర్తించినంతగా పురుషులు గుర్తించలేరు. కాబట్టి స్త్రీ తను ఇష్టపడినవ్యక్తిని ప్రేమించే అవకాశం ఎక్కువ. పురుషుల విషయంలో ఆ అవకాశం తక్కువ. అలాగే ఆయన ఇంకో విషయం కనుక్కున్నాడు. స్త్రీ పురుషులు ఇద్దరూ పరస్పరప్రేమకు ఒకేరకంగాస్పందిస్తారు. అయితే స్త్రీ సాటిస్త్రీని ప్రేమించినంతగా పురుషుడు సాటి పురుషుణ్ణి ప్రేమించలేడు. స్త్రీకి పురుషుడికి ఈ విషయంలో మరో తేడాకూడా వుంది. ఒక జంటనుతీసుకుంటే సాధారణంగా పురుషుడికి స్త్రీపట్ల ఉన్న 'ఇష్టంకన్నా స్త్రీకి



పురుషుడి పట్ల ఉండే 'ఇష్టం' ఎక్కువ - ఇవి ఆయన శాస్త్రీయంగా కనుక్కున్న విషయాలు. సరె ఈ రిసెర్చి సంగతి వదిలెయ్యి, నీకు ఎలాంటి వ్యక్తి కావాలి" అడిగాడు పరబ్రహ్మం.

స్వప్న సిగ్గుపడింది.

"నా దగ్గర సిగ్గెందుకు, నీ మనసు తెలుసుకోడంకోసం అడుగుతున్నాను. ఆలోచించి చెప్పు"

స్వప్న ఆలోచిస్తోంది.

ఇంతవరకు తనకి నచ్చిన వ్యక్తి తటస్థ పడలేదు అనుకుంది. కాని తనకి ఎలాంటి వ్యక్తి కావాలి- ఎలాంటి వ్యక్తి తనకి నచ్చుతాడు- అన్న విషయం ఇంతవరకు ఆలోచించలేదు.

తను ఎలాంటి వాణ్ణి కోరుకుంటోంది.

అందం, కళా హృదయంవున్న సుకుమారుడా ?

నైపుణ్యం, సామర్థ్యం ఉన్న ప్రవీణుడా ?

కండబలం, గుండెబలం ఉన్న మగధీరుడా ?

ఎవరు తనని ఆకర్షించగలరు ?

ఎవరంటే తను ఇష్టపడుతుంది ?

తనకు కాబోయే భర్త ఫలానాలా ఉండాలి అని తాను ఇంతవరకు అనుకోలేదు. అసలు అంతలోతుగా ఆలోచించనే లేదు.

స్వప్న పరబ్రహ్మం వంక చూసింది. పరబ్రహ్మం ఆమెవంక ఆసక్తిగా చూస్తున్నాడు.

"నీకు ఏం కావాలి. అన్న విషయం గురించి నువ్వు ఇంతవరకు ఆలోచించనే లేదు కదూ. నువ్వే కాదు చాలామంది ఇంతే.

మనిషి బాధల్లో తొంభై శాతం తనకేం కావాలో తెలియకపోడం మూలంగా వచ్చినవే."

స్వప్న తలవంచుకుంది.




"నీకు నేనో సహాయం చేస్తాను. నీకు ఓ ప్రశ్నావళి ఇస్తాను. నువ్వు జాగ్రత్తగా ఆలోచించి పూర్తిచెయ్యి. నాకిస్తే నేను చూస్తాను. లేదు ఇవ్వ

కూడదు అనుకుంటే ఇవ్వాల్సిన అవసరం లేదు. దాన్ని పూర్తి చెయ్యడం మూలంగా ఏదో జ్ఞానోదయం అవుతుందని కాదు. సిస్టమేటిక్‌గా నీకు కావలసిన దాన్ని గురించి ఆలోచించడానికి తద్వారా నిన్ను నువ్వు తెలుసుకోవానికి ఇది దోహదం చేస్తుంది. అంతే"

పరబ్రహ్మం ఓ సంచీలోంచి కాగితాలు తీసి ఇచ్చాడు.

"దాన్ని నువ్వు ఒంటరిగా ఉన్నప్పుడు చదివి, ఆలోచించి పూర్తిచెయ్యి. ఇప్పుడు చెప్పు కథ చెప్పమంటావా"

స్వప్న లేచింది. దాంట్లో ఏముందో చూడాలని ఆత్రంగా ఉందామెకి.

"ఒద్దంకుల్ నిద్ర వస్తోంది. మళ్ళీ ఇంకోసారి చెప్పించుకుంటాను. గుడ్ నైట్" స్వప్న గదిలోకి వెళ్ళిపోయింది.

పరబ్రహ్మం ఆ హాల్లోనే కూర్చున్నాడు.

స్వప్న నిద్ర వస్తోందని గదిలోకి వెళ్ళి . ఆ గదిలో లైటు రాత్రి పన్నెండు గంటల వరకూ వెలుగుతూనే ఉండడం అతను గమనించక పోలేదు.

అంత రాత్రివరకు మెలకువగా ఉండి. ఆమె ఏం చేస్తోందో అతనికి తెలుసు.

ఆమె ప్రశ్నావళి పూర్తి చేస్తోంది.

అంటే,

ఆత్మ పరిశోధన చేసుకుంటోంది.

గుడ్ !

స్వప్న గదిలో లైట్ ఆరిపోగానే, పరబ్రహ్మం తను మామూలుగా బస చేసే గెస్టురూంలోకి వెళ్ళాడు.

○ ○ ○ ○ ○

"అంకుల్ బ్రేక్‌ఫాస్ట్ రెడీ" తలుపు దగ్గర నిలుచుంది స్వప్న. తలెత్తి చూసాడు పరబ్రహ్మం, ఆమె పలకరించుకుంది.




ఆమెలో ఏదో మార్పు వచ్చినట్టు ఉంది. ఒదిగిఉన్నట్టుగా అనిపించింది. కారణం గతరాత్రి జరిగిన ఆత్మ పరిశోధనా ! (సశేషం)

# సినీ మానియాక్!

మైనంపాటి భాస్కర్

'వసంతకోకిల' సినిమా హాల్లో నిల్చుని ఉన్నాను. కమలహాసన్ పిక్చర్లు సరదాగా ఉంటాయని నాకు ఇష్టం. బుకింగ్ తెరవడానికి ఇంకా పావుగంట టైం ఉంది.

ఆ టైం సద్వినియోగం చెయ్యడానికి గానూ అప్పటి దాకా 'హస్త భూషణంగా' ఉన్న పుస్తకం తెరిచాను. స్టీఫెన్ లీకాక్ రచనల సంపుటం అది. అందులో "ది గోల్ఫ్ మానియాక్" అన్న టైటిల్ దగ్గర చూపులు నిలిచాయి.

నాలుగు లైన్లు చదవగానే 'హ్హ హ్హ హ్హ హ్హ' అని నవ్వడం మొదలెట్టాను.

నా పక్కన నిలుచున్నవాళ్లు ఉలిక్కిపడి, దడుచుకుని, తర్వాత నా వైపు సీరియస్‌గా చూడటం మొదలెట్టారు.

రెండుజెళ్ళ సీత

"సారీ! హాస్య రచన చదువుతున్నాను!" అని సిగ్గుపడుతూ వాళ్ళకి సంజాయిషీ ఇచ్చి, పెదిమలు బిగించి, డొక్కలెగరేస్తూ, నవ్వాపుకుంటూ మిగతాది చదివాను.

లీకాక్ ఓసారి శుభమా అని రైల్లో ప్రయాణం చేస్తూ ఉంటే ఒక [illegible] తగులుతాడు. పరిచయం చేసుకుంటాడు. తనకి గోల్ఫ్ ఆట అంటే ప్రాణం అని చెప్పేస్తాడు.

అది మొదలు!

ఆ తర్వాత లీకాక్‌కి గోల్ఫ్ గురించి ఊదరగొట్టెయ్యడం మొదలెడతాడు. ఈ అనంత విశ్వంలోని ఏ సబ్జెక్టు గురించి మాట్లాడినా దాన్ని అతను అలవోకగా గోల్ఫ్ ఆట మీదికి మళ్ళించేస్తూ ఉంటాడు. రైలు దిగేలోగా తల దిమ్మెత్తిపోతుంది లీకాక్‌కి.

హాస్యం కోసం కొంచెం అతిశయోక్తులు రాశాడేమో అనిపించింది.

మరీ అంత విపరీతంగా ప్రవర్తిస్తారా ఎవరన్నా?... దాటే

నా చాటు తత్వం తీర్చేస్తున్నానికి దేవుడు అప్పుడే శుభారంభం పెట్టినట్లు ఆ తర్వాత తెలిసింది.

టిక్కెట్టు చేతికొచ్చిన తర్వాత హాయిగా ఊపిరి తీసుకుని, నింపాదిగా కాఫీ తాగి, హాల్లోకి వెళ్ళాను. అప్పటికే లైట్లు ఆర్పేశారు. న్యూస్ రీల్ జరుగుతోంది. సీటు నెంబరు కోసం వెదుక్కుంటున్నాను. 'కే. తొమ్మిది' నా నెంబరు

"మీ నెంబరు కే. నైనా సార్! ఇదే! రండి! కూర్చోండి!" అని మర్యాద చేశాడు ఒక ప్రేక్షకుడు

"థాంక్స్!" అని స్పష్టంగా గొణిగి, కూర్చున్నాను

"మీ ఒక్క సీటు తప్ప హాలంతా నిండిపోయింది మీరు రారేమో. ఒక సీటు అనవసరంగా వేస్టయిపోతుందేమో అని భయమేసింది! కమల హాసన్ పిక్చర్లో సీట్లు ఖాళీగా ఉండడం, అందులోనూ నష్టం చే, భరించలేను నేను థాంక్ గాడ్! మీరొచ్చేశారు!"

ఒకసారి అతన్ని వింతగా చూసి, నవ్వి ఊరుకున్నాను.

న్యూస్ రీల్ జరుగుతూనే ఉంది. అతనికి నామీద ధ్యాస నిలిచినట్టు లేదు.

"సార్! మీరు 'కే' వరసలోనే ఎందుకు తీసుకున్నారు సీటు? నా లాగా కావాలని 'కే' లోనే బుక్ చేయించు న్నారా ఏమిటి?"

"ఎందుకు?" అన్నాను తికమకగా

"నేనెప్పుడూ అంతే! కమలహాసన్ సినిమా వస్తే 'కే' వరసలోనే బుక్ చేయించుకుంటాను కే ఫర్ కమల్!" అన్నాడు ఆనందంగా

"ఓహో!" అన్నాను- ఇంకేమనాలో తోచక.

"మీది మంచి టేస్టు! మంచి సినిమాకి వచ్చారు" అని సర్టిఫికెట్ ఇచ్చాడు ఉదారంగా. సినిమా ఇంకా మొదలవకుండానే!

నేను వినయం అభినయించాను సినిమా మొదలయింది సరదాగా ఉంది సినిమా

కమలహాసన్ మొదటిసారిగా తెర మీద కనిపించగానే శివమెత్తినట్లు ఊగి



# రెండు జెళ్ళ సీత

పోయి చప్పట్లు కొట్టాడు అతను కాసేపటి తర్వాత కమలహాసన్ పాట వచ్చినప్పుడు మొదట కుర్చీమీదా, ఆ తర్వాత నా వీపుమీదా దరువు వేశాడు పాటకి అనుగుణంగా కాళ్లు కదుపుతూ కుర్చీలో కూర్చునే డాన్సు లాంటిది చేశాడు.

ఇంటర్వెల్ వచ్చింది. "మధ్యలో ఈ ఇంటర్వెల్, పెంటర్వెల్ ఏమిటి" అని విసుక్కున్నాడు అతను. లైట్ల వెలుతురులో అతనివైపు పరీక్షగా చూశాను షర్టు జేబుమీద 'కే' అని అక్షరం. దానిపక్కనే ఒక కమలం ఎంబ్రాయిడరీ చేసి ఉన్నాయి బెల్టుమీద కూడా 'కే' అనే మోనోగ్రామ్ ఉంది.

"మీ పేరేమిటి సార్?" అన్నాడు

చెప్పాను.

"నా పేరు అనూప్" అన్నాడు

"మరి షర్టుమీదా. బెల్టుమీదా 'కే' ఏమిటి?" అని నేను అడగలేదు 'కె ఫర్ కమల్' అని అర్థమైపోయింది.

"వెరీ గాచ్యూ మీచ్యూ!" అంటూ కరచాలనం చేశాడు అనూప్. తర్వాత నా చెయ్యి నాకు ఇచ్చెయ్యకుండా, దాన్ని బరబరా ఈడ్చుకుంటూ ఫాయర్ లోకి తీసుకెళ్ళి. స్టిల్సుముందు ఆగాడు. పరవశంగా చూస్తూ, "ఈ నాలుగు సీన్లూ వచ్చేశాయి కదండీ. మిగతా నాలుగూ ఇంకా రావాలన్నమాట! అబ్బ! ఆ పోజు చూడండి, కమల్ ఎంత బావున్నాడో!" అన్నాడు.

నేను చూస్తూనే ఉన్నాను. కానీ చూసింది మెదడుకి ఎక్కలేదు. నా మనసంతా టాయిలెట్సు వైపు ఉంది. అసలే చలికాలం! అర్జెంటు! నా చేతి మీది రోమాలు నిక్కబొడుచుకున్నాయి. చెయ్యి విడిపించుకోబోయాను.

కానీ వదలడే! కళ్ళేసినట్లు నన్ను పట్టేసుకున్నాడు అనూప్.

నాకు కళ్ళెంబడి నీళ్లు తిరగడ మొక్కటే తక్కువ!

తర్వాత కూల్‌డ్రింక్సు పార్లర్ దగ్గరికి లాక్కెళ్ళి కోలా తాగించాడు నేను డబ్బు లివ బోయినా ఇవ్వనివ్వలేదు. తనే జేబులో చెయ్యిపెట్టి అయిదు రూపాయల నోటు తీశాడు. ఆ కార్యక్రమంలో ఒక్క క్షణం నా చెయ్యి వదలగానే తక్షణం ఆ అవకాశం సద్వినియోగం చేసుకుని స్ప్రింగులా దూసుకుపోయాను.

అమ్మయ్య! ఎంత రిలీఫో!

అబ్బాయికింకా కుర్రతనం పోతే.....



మళ్ళీ సినిమా చూశాం.

క్లయిమాక్సులో కమలహాసన్ రైల్వే ప్లాట్‌ఫారం మీద ట్రాజెడీ యాక్షన్ చేస్తున్నప్పుడు సీట్లోనుంచి లేచిపోయి, పెద్దగా విజిలేశాడు అనూప్.

సినిమా వదిలారు గానీ అతను నా చెయ్యి వదలలేదు.

బయటికి వచ్చాం.

మంచి సినిమా చూశానన్న తృప్తి కలిగింది నాకు.

"సార్! మనిద్దరం కలిసి ఒక థ్రిల్లింగ్ అనుభవం షేర్ చేసుకున్నాం! అందుకని మనిద్దరం కలిసి పార్టీ చేసుకోవాలి! ఒక్క పది నిమిషాలు నాతో స్పెండ్ చెయ్యండి!" అన్నాడు అనూప్.

"థ్రిల్లింగ్ అనుభవమా?" అన్నాను అర్థంకాక.

"అవును సార్! కమలహాసన్ పిక్చర్ చూడడం అంటే థ్రిల్లింగ్ ఎక్స్‌పీరియన్సేముంటుంది. ఒక్క పది నిమిషాలు.. కమలహాసన్ పిక్చర్లో నా పక్కన కూర్చున్నవాడికి కాఫీ తాగించకుండా వదలను నేను! అది నా ఆచారం!" అన్నాడు.

"నాకు అర్జెంటు పని ..." అని ఏదో చెప్పబోయాను, తప్పించుకోవడానికి.

"ఏముంది అంత అర్జెంటు? అవతల నా వైఫ్‌కి డెలివరీ టైము! నెప్పులు



# రెండు జెళ్ళ సీత

జంధ్యాల     కేశవరావు

పడుతోంది. అయినా నేను వచ్చెయ్య లేదూ? మరేం మాట్లాడకుండా పదండి!" అని నన్ను మరో మాట మాట్లాడనివ్వకుండా గెంటుకుంటూ తీసుకెళ్లాడు.

అతని చేతిలో ఉన్న నా చేతికోసం పరిగెత్తుకుంటూ వెళ్లాను.

మధ్యలో ఒక పుస్తకాల షాపు కన బడింది. వెంటనే మంత్రం వేసిన వాడిలా ఆగిపోయాడతను.

"అరె! అరెరె! 'సినిమాపత్రిక' కవర్ పేజీ కమల్ అందోయ్ బాబూ! కొనెయ్యకపోతే కళ్లు పోతాయ్!" అంటూ చటుక్కున షాపులో దూరి పోయి 'సినిమాపత్రిక'తో బాటు కమల హాసన్ ఫోటో ఉన్న మరో అరడజను పత్రికలు కొన్నాడు. ఆ తర్వాత రీడర్స్ డైజెస్ట్ అందుకుని పర పర పేజీలు తిప్పి, చిదరగా మొహం పెట్టి దాన్ని విసురుగా గిరవాటేశాడు "ఇదసలు ఇంటర్నేషనల్ మేగజైన్ ఎలా అయిందండీ కమల్ ఫోటో ఒక్క సారన్నా వేశారా వీళ్లు?" అన్నాడు. రీడర్స్ డైజెస్టు కమల్ ఫోటోని వెయ్యని పాపమనే అం రాధాన్ని తను డైజెస్టు చేసుకోలేనట్లు!

అక్కడ నుంచి హోటల్‌కి ప్రయాణం కట్టించాడు.

కూర్చున్న తర్వాత సర్వర్ రాగానే "ఏమోయ్ సర్వారావ్! కా తో స్టార్ట్ అయ్యేవి ఏమేం ఉన్నాయ్?" అన్నాడు

సర్వరు బిత్తరపోయి చూస్తూ. "ఏమిటి సార్?" అన్నాడు

"అదేనయ్యా బాబూ! 'క' అనే అక్షరంతో మొదలయ్యే పదార్థాలు ఏమేం ఉన్నాయ్?"

"కారట్ హల్వా, కాజు పకోడా, కాబేజ్ వడా, కారబూందీ........"

"ఆహా! అయితే అన్ని రకాలని కొకటి చొప్పున తెచ్చెయ్! ఇవాళ అంతా 'క' తోనే గడిచిపోవాలి. కే ఫర్ కమల్!" అన్నాడు.

కారట్ హల్వా. కాజూపకోడా వచ్చాయి

"ఇంకేం సినిమాలు చూశారు రు?" అన్నాడతను పకోడీ తుంచుతూ.

"మేఘ సందేశం ... ... ..." అనబోయాను.

పకోడీ నోట్లో పెట్టుకోబోతున్న అతను ఆగి, తెగులు తగిలిన కోడి



లాగా చూశాడు. సంభాషణ ట్రాక్ మారి, తప్పుదోవన పక్కకెళ్ళి పోతున్నట్లు అనుమానం వచ్చింది అతనికి. మొహంలో అశాంతి చోటు చేసుకుంది.

"మేక సందేశమూ, తోక సందేశమూ కాదండి బాబూ! కమల్ పిక్చర్లు ఇంకేం చూశారు?"

"అన్నీ చూసేశాను" అన్నాను.

"అమావాస్య చంద్రుడూ, టిక్ టిక్ టిక్ మళ్లీవచ్చాయిగా! చూళ్లేదా?"

"ఇదివరకే చూసేశాను".

"అనూప్ నా వైపు ఎగతాళిగా చూశాడు".

"అదేమిటి! కమల్ పిక్చర్లు ఒక్కసారే చూసి ఊరుకుంటారా మీరు! మిమ్మల్ని చూస్తుంటే ఒక జోక్ గుర్తొస్తోందండీ। మీలాంటి వాణ్ణే ఎవణ్ణో ఒక పెద్దమనిషి అడిగాడుట "సిగరెట్ కాలుస్తారా?" అని. "లేదు ఒకసారి కాల్చిచూశాను. నచ్చలేదు." అన్నాడుట ఆయన.

"పోనీ విస్కీ తాగుతారా?"



"లేదు! ఒకసారి తాగిచూశాను నచ్చలేదు."

"సరే! నాన్ వెజ్ తింటారా?"

"వద్దు! ఒకసారి తినిచూశాను. నచ్చలేదు."

ప్రశ్న లడుగుతున్న పెద్ద మనిషికి ఒళ్ళుమండి "బహుశా మీకు ఒక్కళ్ళే సంతానం అయివుంటారు! అవునా?" అన్నాడు బోలెడంత అర్థం గుప్పిం చేస్తూ" అని చెప్పి నవ్వాడు అసూప్. "మన్లోమాట! మీకెంత మంది పిల్లలండీ?"

నా గొంతుకి వచ్చి వెలక్కాయ అడ్డం పడ్డట్లు అయింది. నాకు ఒక్కతే కూతురు. అదే చెప్పాను హీన స్వరంతో.

విజయ గర్వంతో నవ్వాడు అసూప్. "అప్పుడే కనిపెట్టేశానండీ! కమల్ పిక్చర్స్ ఒక్కసారే చూస్తారని చెప్ప గానే ఆ సంగతి అర్థమై పోయింది నాకు!"

దారుణమైన అతని అపోహని ఎలా దూరం చెయ్యాలో అర్థంకాక గింజు



కున్నాను. కొన్ని విషయాలకి ఇలా ఫులు ఉంటవు మరి!

"మీ కెంత మంది పిల్లలు?" అన్నాను మాటవరసకి.

"ఇద్దరు- అమ్మాయి పేరు వాణి, అబ్బాయి పేరు గణపతి. కమల్ భార్య పేరు వాణీ గణపతి కదా! అందుకే మా పిల్లలకు ఆ పేర్లు పెట్టాను. పిల్లలంటే గుర్తొచ్చింది. కమలహాసన్ ఇంత పిల్లాడిగా ఉన్నప్పటి నుంచీ సినిమా ఫీల్డులోనే ఉంటున్నాడు. అందుకే ఇవాళ అందర్నీ షేక్ చేసేస్తున్నాడు మరి!"

"అవును! నిజమే" అని ఒప్పుకున్నాను. "మంచియాక్టరతను లైట్ కామెడీ అద్భుతంగా చేస్తాడు." అన్నాను.

అసూప్ ముఖం పెద్ద సైజు కమలంలా వికసించింది.

కొంచెంసేపు ఉపన్యాసంలా కమల్ యాక్షన్ గురించి చెప్పాడు. ఏకీభవించాను.

"ఇంకేమన్నా ప్రోగ్రాములకి అటెండ్ అవుతుంటారా? డాన్సులూ.. అవీ...." అని అడిగాను కుతూహలంగా.

శ్రీ భ్రమరాంబికా ఫిలింస్

# రెండు జెళ్ళ సీత

జంధ్యాల కేశవరావు

"లేదండీ". అన్నాడతను చిరాగ్గా వెంటనే "డాన్సంటే గుర్తొచ్చింది. ...కు తెలుసా? కమలహాసన్ మొదట్లో డాన్స్ డైరెక్టర్‌గా ఉండేవాడు." అన్నాడు.

"అవును. విన్నాను" అన్నాడు తర్వాత, 'బుక్సేమన్నా చదువుతుంటారా? లీకాక్ మీకు ఇష్టమేనా ?" అన్నాను, నా చేతిలోని బుక్కు చూపిస్తూ.

"లీకాకా? లేదు. లీకాక్ అంటే గుర్తొచ్చింది. కమల్ షటిల్‌కాక్ ఆడతాడుట. తెలుసా?" అన్నాడు.

కాస్త వ్యవధిఇచ్చి, "రాజ్‌కపూర్ అంటే ఇష్టమేనా మీకు? ప్రేమ్‌రోగ్ చూశారా. అన్నాను.

"అలాంటి వన్నీ చూసే రాగం లేదండీ నాకు. రాజ్‌కపూర్ అంటే గుర్తొచ్చింది. రాజ్‌కపూర్ ఫ్యామిలీ అంతా సినిమాల్లో చేరిపోయినట్లు న కమల్ కుటుంబం అంతా కూడా సినిమాల్లో కొచ్చేస్తున్నారు తెలుసా, కమలహాసన్, చారుహాసన్, సుహాసిని...."

నేను మొన్న ఛార్లీ చాప్లిన్‌ది 'మోడర్న్ టైమ్స్' చూశాను." అని అన్నాను మాట మార్చాలని.

"ఛార్లీ చాప్లినా. అతను మరిఇదిగా ఇమిటేట్ చేస్తాడండీ కమలహాసన్‌ని. కమల్‌ది గుబురు మీసం అయితే అతనిది ఫ్రెంచ్‌కట్ మీసం. అంతే తేడా" అన్నాడు.

"ఛార్లీ చాప్లిన్ చాలా పాత.... అనబోయాను. అతను నన్ను సగంలోనే కట్‌చేసి, "పాత అంటే గుర్తొచ్చింది, కమలహాసన్ పాత సినిమా 'ఇది కథ కాదు' చూశారా, అందులో అచ్చం స్ప్రింగు బొమ్మలా ఒక డాన్సు చేస్తాడు గుర్తుందా. అది కాపీ కొట్టేసి వొక ఇంగ్లీషు సినిమాలో పెట్టుకున్నారుట" అన్నాడు.

చిట్టీ చిట్టీ బ్యాంగ్ బ్యాంగ్‌లో డిక్ వాన్ డైక్‌ది అలాంటి డాన్సే ఉంది." అన్నాను నేను నిస్పృహగా.

ఇంక ఆ సంభాషణ ధోరణి మార్చాలని నాకు తీవ్రంగా అనిపించింది. అందుకని సినిమా ఫీల్డుకి బొత్తిగా సంబంధం లేని టాపిక్ ఎత్తాను.

"మంచి బెల్టులెక్కడ దొరుకుతాయి సార్? కొంచెం పొట్టవచ్చేసి పాంటు నిలవట్లేదు. జారి జారి పోతోంది." అన్నాను.




"మీరు ఎక్కడ కొన్నారు! నేరో బెల్టే కొనండి! కమల్ అలాంటి బెల్టే పెట్టుకుంటాడు తర్వాత ఒళ్ళు రాకుండా ఉండాలంటే కమల్‌లా రోజూ ఎక్సర్‌సైజ్...."

ఇండియా పరిస్థితి ఎలా ఉందంటారూ?" అన్నాను నేను ఆర్తనాదం లాంటిది చేస్తూ.

"ఆఁ! ఏముందండీ ఇండియా పరిస్థితి! ఆదేశం దగ్గరా ఈ దేశం దగ్గరా అప్పులు తెచ్చుకు తినడమేగా! అప్పులంటే గుర్తొచ్చింది! కమల్ అప్పుల గురించి పేల్చిన జోక్ మీకు తెలుసా? కరాటే నేర్చుకోవడం వల్ల ఒక లాభం ఉందని చెప్పాడు కమల్. ధీమాగా అప్పులు అడగొచ్చుట, ధైర్యంగా అప్పులు వసూలు చేసుకోవచ్చుట! వెరీఫన్నీ! కదూ?"

ఒక్కసారి గట్టిగా తల విదిలించాను ఇంక అతనితో కలిసి ఉన్నంతసేపూ ఆ సంభాషణ తప్ప మరోటి చెల్లదని అర్థమైపోయింది. అందుకని వీరోచితంగా ఈసారి నేనే కదిలించాను.

"ఎలా ఉంది వసంతకోకిల?" అన్నాను.

అతను తక్షణం మహా అలర్టుగా అయిపోయి "ముందు మీకెలా ఉంది చెప్పండి!" అన్నాడు. అతనిగొంతులో ప్రాణభయం చోటు చేసుకుంది.

"నైస్‌మూవీ! మంచి ఎంటర్‌టైన్



మంటు!" అన్నాను.

అతని ముఖకవళికలు వెంటనే మారి పోయాయి. గొంతు కటువుగ మారింది.

"కాదు! మీరు పొరబడ్డారు! అది నైన్‌స్మూవీ కాదు! మంచి ఎన్‌టర్ టైన్‌మెంటు అసలేకాదు!"

"మరి?" అన్నాను విస్మేరపోయి.

"అది అసలుసిసలైన కళాఖండం! మాగ్‌సేసే అవార్డుఇవ్వాల్సినచిత్రం"

"మాగ్‌సేసే అవార్డు జర్నలిజానికి ఇస్తారనుకుంటాను. మీరనుకునేది బహుశా ఆస్కార్...."

"ఆస్కారో గీస్కారో, ప్రపంచం లోకెల్లా అతి గొప్ప అవార్డు ఏదిఉంటే అది ఈ పిక్చర్‌కి ఇవ్వాలి! దీనికేకాదు! కమల్ నటించిన ప్రతి చిత్రానికీ ఇవ్వాలి! ఇంతమంచిపిక్చరు మీకు కేవలం 'నైన్‌స్మూవీ'లా కన బడిందా? మీలో ఏదో లోపం ఉంది!"

"అహా! అలా కాదు!" అన్నాను సంజాయిషీ చెబుతూ, "కొన్ని చోట్ల చాలా టచింగ్‌గా, సున్నితమైన హాస్యా లతో హృదయాన్నితాకేటట్లు చేశాడు కమలహాసన్. చివర్లో అతను బండల మధ్య పడుకుని ఆదుర్దాగా ఆశ్రమం



వైపు చూసే సీన్లో 'అయ్యోపాపం' అని సానుభూతి కలుగుతుంది. కానీ క్లయిమాక్సులో రైల్వే ప్లాట్‌ఫారం మీద ప్లాట్‌ఫారం పట్టినంత ఓవరాక్షన్ చేసినప్పుడు మాత్రం ఆ సింపతీ తగ్గి పోతుంది. అఫ్‌కోర్స్! కొంచెం ఓవర్ చేస్తేనే ప్రేక్షకులకు నచ్చుతుం దని అతనికి తెలుసని నాకు తెలుసు. ఏమైనా, ఇది కేవలం నా పర్సనల్ ఒపీనియన్ అంతేకాక కథపరంగా చాలా లూజ్ ఎండ్స్ ఉన్నాయి. మచ్చుకి....

"సర్వర్! మిగతా టిఫిన్లు కాన్సిల్ ఇంక వేరే ఏమీ తేకు!" అని అరి చాడు "మరి ఇందాక మీకు కూడా కమల్ అంటే ఇష్టమైనట్లు మాటాడారే? ఇప్పుడిలా ప్లేటు మార్చారేమిటి?" అన్నాడు ఆరోపణగా.

"నాకు కమలహాసన్ అంటే ఇష్టమే! కాని నేను సినిమాలు విమ ర్శగా చూస్తాను"

"మీరు పిల్లకాయతనంగా మాట్లాడు తున్నారు. కమల్ చేసే ప్రతి బిట్టూ పరమాద్భుతంగా తప్ప మరోలా ఉండ డానికి వీల్లేదు. మీకు కమల్ అంటే ఏదో గ్రడ్జ్ ఉంది".

"చూడండి! ట్రాన్‌సల్ అంటే నాకు చాలా అభిమానం. అయినా కొన్ని సినిమాల్లో అతను బాగా చెయ్య

FREE!! FREE!!

# The Father of Success is work

"తన కష్టార్జితము చేత సుఖపడుట కంటెను నరునికి మేలుకరమైనదేదియు లేదని మహాజ్ఞాని సొలొమోను సెలవిచ్చాడు. కష్టించి ఆర్జించిన ధనముతో సుఖపడమని దేవుడు కూడా మానవులను ఆజ్ఞాపిస్తున్నాడు. తాతలు సంపాదించిన ఆస్తిపాస్తులను కాళ్లు కదపకుండ, కూర్చుని తినే సోమరిపోతులు ఘోరమైన పాపములలో పడి అతి దౌర్భాగ్యస్థితికి దిగజారిపోగలరనుటకు ఎటువంటి సందేహము లేదు.

తెల్లవారిన దగ్గరనుండి, మన కిష్టమున్నను, లేకున్నను కొన్ని పనులు నిర్వహించక తప్పదు. అయితే తాము చేయవలసిన పనిని శ్రద్ధగా, నీతితో, నిజాయితీతో చేయువారు ఎంతో నిగ్రహమును, శ్రద్ధాసక్తిని, ఆత్మ సంతృప్తిని పొందగలరు. అంతేగాని, అశ్రద్ధతో, అనాసక్తితో, అంటీ అంటనట్లు చేయువారు ఆ పనిలో అత్యున్నత శిఖరాలను ఎన్నటికి అందుకోలేరు. బైబిలును క్రమబద్ధము చేయుటకు Thompson దంపతులు 35 సం॥ వినియోగించారు. "Milton" సాహిత్యము నందును "Vebster" తన నిఘంటువును తీర్చిదిద్దుటకు ఎంతో కృషి చేశారు. కాబట్టి వారికష్టానికి తగిన ప్రతిఫలం పొందగలిగారు

తోటి మానవుల అభ్యుదయంకోసం, శక్తి కొలది పాటుపడే దానికన్నా మించిన కార్యం మరేదియు లేదు. కఠినమైన రాతిగుండెను కరగించి నూతన హృదయాన్ని మార్చి వారిని నూతన వ్యక్తులుగా రూపొందించే క్రీస్తు శక్తిని గూర్చి తెలుసుకొన్నారా

"చదలవాడ చంద్రమతీదేవి"

---

లేదని ఏమర్చిస్తూ ఉంటాను నేను. అలాగే...."

స్ప్రింగులా లేచి నిలబడ్డాడు అనూప్.

"వస్తాను. నేను అర్జెంటుగా వెళ్ళాలి" అన్నాడు టైం చూసుకుంటూ.

అతన్ని నొప్పించినందుకు గింజుకుంటూ, "హాస్పిటల్ కి వెళ్తున్నారా ? మీ భార్యకి డెలివరీ టైం అని చెప్పారు కదా ?" అన్నాను.

అనూప్ నన్ను పురుగుని చూసినట్లు చూశాడు. "హాస్పిటల్ కి కాదు. వసంత కోకిల మళ్ళీ సెకెండ్ షో చూడాలి !" అన్నాడు.

"ఇప్పుడు క్యూలో నించుంటే టిక్కెట్లు దొరుకుతాయా ? అసలే ఫస్ట్ డే" అన్నాను నేను.

"అందుకే ముందరే వరసగా రెండు షోలకీ టిక్కెట్లు బుక్ చేయించుకుంటాను. ఇదిగో 'కే' జెన్, అంటూ మాంత్రికుడు టోపీలో నుంచి కుందేలుని తీసినట్లు జేబులోనుంచి టిక్కెట్లు తీశాడు.

నోట మాట రాకుండా కొయ్యబారి పోయాను నేను.

అతను వెళ్ళబోతూ ఒక్కసారి వెనక్కి తిరిగాడు. నావైపు సూటిగా చూస్తూ. "సార్ ! మీ ప్రవర్తన చాలా అసహజంగా ఉంది. సాధ్యమైనంత త్వరలో సైక్రియాట్రిస్టుకి చూపించుకోండి ! లేకపోతే పిచ్చి ముదరగలదు" అని ఉచిత సలహా పారేసి, విసవిస నడుస్తూ వెళ్ళిపోయాడు ; "నైస్ మూవీట ! నైస్ మూవీ ! కళాఖండాన్ని పట్టుకుని......" అని అతడు గొణగడం వినబడింది.

నాకు పిచ్చి పడుతుందేమోనని ఒక్క క్షణం నిజంగానే భయమేసింది.

(ఇందులో కొంతమంది నటీనటుల పేర్లు ఉపయోగించుకోవడం కేవలం కథాసౌలభ్యం కోసమే తప్ప మరేమీ కాదని మనవి).

★ ★ ★

## పక్షం రోజులలో కొత్త ప్రభుత్వం సాధించిన కొంగ్రొత్త విజయాలు

ఆరుకోట్ల తెలుగు ప్రజల విశ్వాసాన్ని నిలబెట్టుకోవాలనే కృత నిశ్చయంతో, కార్య నిర్వహణకు నడుం కట్టిన నూతన ప్రభుత్వం ప్రథమదశలో ప్రగతికి వెలుగుబాటగా అన్న వాగ్దానాలను అమలు చేయడానికి చర్యలు తీసుకుంటున్నది.

ఉదాహరణకు :

★ పేదలకు కిలో బియ్యం రెండు రూపాయలకు అందించటానికి, నిత్యావసర వస్తువుల ధరలను అదుపులో పెట్టడానికి సంక్షేమ పథకాలు సిద్ధమయ్యాయి.

★ పాతశాలలను పాకశాలలుగ మార్చకుండా పరిశుభ్రంగా, బడిపిల్లలకు రొట్టె, పాలతో కూడిన ఉచిత మధ్యాహ్న ఆహార పథకం రూపొందించబడింది

★ విద్యాసంస్థలలో డొనేషన్ విధానాన్ని రద్దుచేసి, అక్రమాలను తొలగించి అర్హతకి అవకాశమిచ్చే నూతనాధ్యాయం ఆరంభమైంది.

★ అన్ని రంగాలలో అవినీతిని, లంచగొండితనాన్ని నిర్మూలించటం ప్రారంభమైంది.

★ సుస్థిర శాంతిభద్రతలు నెలకొల్పడానికి ఆడపడుచులకు రక్షణ కల్పించటానికి కట్టుదిట్టమైన ఏర్పాట్లు జరిగాయి.

రాష్ట్రాభివృద్ధి కార్యక్రమాలకు అన్ని వర్గాలవారి సహకారాన్ని నూతన రాష్ట్ర ప్రభుత్వం అర్థిస్తున్నది.

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ : హైదరాబాదు.
353/పి 3/11/83-1



# యర్రంశెట్టి సాయి

# హ్యూమరాలజీ

## 2

మా కాలనీ పేరు మీకు తెలుసు కదా!

అది మా కాలనీ అంటే నా ఉద్దేశం నిజంగా మా సొంతకాలనీ అని కాదు.

మేమంతా ఆ కాలనీలో అద్దెకుంటున్నాం. ఆ కాలనీ ఇళ్ళ ఓనర్లందరూ హౌసింగ్ బోర్డువాళ్ళు. సొంత ఇళ్లు లేని వాళ్ళ కోసం కట్టించి ఇచ్చిన హౌసింగ్ బోర్డు కాలనీలో తమ పదకొండు సొంత ఇళ్ళల్లో ఉంటున్నారు.

ఆ రోజు ఆదివారం అవడం వల్ల ఉదయం ఎనిమిది గంటల వరకూ హాయిగా నిద్రపోవచ్చని నేను ప్లాన్ వేశాను. ఎందుకంటే నిద్ర అనేది



# శంకర్ దాదా జిందాబాద్

తెలుగు రాజధాని పౌరులకు రేషన్‌లో దొరికే పంచదార లాంటిది. లేదా సిమెంట్ అంత అపురూపమయినది అనికూడా అనుకోవచ్చు. మా ఎదురింట్లో వున్న సింహాద్రి మాత్రం నిద్రని కిరోసిన్‌తో పోలుస్తూంటా డెప్పుడూ.

ఎందుకంటే రాత్రి పన్నెండింటి వరకూ ఆ చుట్టుపక్కల ఎక్కడోచోట లౌడ్ స్పీకర్లలో సినిమాపాటలూ, అరుపులూ, కేకలూ వినబడుతూనే ఉంటాయ్. అంచేత అంత వరకూ గారంటీగా ఎవరికీ నిద్ర ఉండదు. పోనీ పన్నెండు తర్వాతే పడుకుందామా అంటే- మా కాలనీ పంపుల్లో నీళ్లు రాత్రి ఒంటిగంట నుంచీ రెండింటి వరకూ మాత్రమే వస్తాయ్.

"పోనీ రెండింటికి పడుకోవచ్చు కదా- దానికింత పెద్దరాద్ధాంతం ఎందుకట?" అని మీరు విసుక్కోవచ్చు.

కానీ రెండింటికి కూడా పడుకోడానికి వీల్లేదు. ఎందుకంటే రెండింటి నుంచీ మూడున్నర వరకూ మన ఆంధ్ర ప్రదేశ్‌లో దొంగలుపడే టైము. రోజూ ఆ టైములో మనింట్లోనో, పక్కింట్లోనో, లేదా కాలనీలో ఏదోక ఇంట్లో దొంగలు పడక తప్పదుకదా! మరి ఆ దొంగలు అలా ఊడ్చుకెళ్ళిపోయాక మనం నలుగురినీ పిలవడం- లేదా నలుగురూ మనల్ని పిలవడం- అందరూ కలసి ఆ దొంగతనం గురించి మాట్లాడుకోవడం- జోకు లేసుకోవడం- జరుగుతుంది కదా. ఇక నాలుగ్గంటలకు పాల వాన్ వచ్చేస్తుంది.

అయిదు గంటల్లోపల పాల పాకెట్ తెచ్చుకోకపోతే- ఆ తరవాత దొరకదు.



శ్రీభ్రమరాంబికా ఫిలింస్

# రెండు జెళ్ళ సీత

జంధ్యాల కేశవరావు

మన పాలపాకెట్‌ని మరో పావలా ఎక్కువ ధరకు ఎవరికో అమ్మేస్తాడు బూత్‌వాడు. లేదా ఆ పాకెట్‌లో పాలు కొన్ని తీసేసి నీళ్ళు కలిపేస్తాడు. (ప్లాస్టిక్ పాకెట్‌లోని పాలు ఎలా కల్తీ చేస్తాడా అని మా కాలనీ వాళ్ళందరం ఎంతో ఆలోచించాంగానీ— ఇంతవరకూ ఎవరూ కనిపెట్టలేక పోయాం).

"పోనీ నాలుగున్నరకు పడుకోవచ్చు కదా, మాయ రోగమా?" అని మీరన వచ్చు. కానీ సరిగ్గా నాలుగున్నరకే పని మనిషి తలుపు కొడుతుంది.

ఆమె టైము నాలుగున్నర నుంచీ అయిదు వరకూ, ఆ అరగంట సేపూ అంట్లు ఎగిరిపడడం- దొల్లడం లాంటి శబ్దాలు ఎవరాపగలరు. పోనీ ఆ పని మనిషిని ఆరున్నరకు రమ్మందామా అంటే- "నేను నాలుగున్నర కయితేనే వస్తాను! ఇష్టం లేకపోతే రిజైన్ చేస్తాను" అని వార్నింగిస్తుంది. అంచేత అయిదింటి వరకూ నిద్ర ఖాళీ!

ఆ తరువాత వంట చేసే కార్యక్రమం ప్రారంభమయి పోతుంది. అప్పుడే న్యూస్ పేపరు

ఇవాళ 'ఈనాడు'లో ఏమి రాశారో చూద్దాం అనే కోరిక నిద్రను పూర్తిగా తరిమేస్తుంది. ఇక ఆరింటికి లేచి రెడీ అవడం ప్రారంభిస్తేగాని ఎనిమిదింటికి ఇంట్లో నుంచి బయటపడడం సాధ్యం కాదు. ఎనిమిదింటి నుంచీ రోడ్‌మీద బస్ స్టాప్‌లో ఆంధ్రప్రదేశ్ వారి ఆర్. టి. సి. బస్‌కోసం పడిగాపులు పడితేగాని తొమ్మిది గంటలకు. బస్ దొరకదు. తొమ్మిదింటి నుంచీ గంట న్నర పాటు అది చీమలా వేగంగా ప్రయాణిస్తే గానీ మన రాజధాని ట్రాఫిక్‌లో పది కిలోమీటర్ల దూరం వెళ్ళలేదు కదా!

కనుక ఆదివారం ఒక్క రోజు మాత్రమే కరువుతీరా నిద్రపోయేందుకు ఎక్కువ అవకాశాలున్నాయ్.

అయితే ఆరింటికల్లా తలుపు గట్టిగా బాదడం వినిపించేసరికి అప్పుడే పడుతున్న నా నిద్ర కాస్తా ఎగిరిపోయింది.

ఎవరా తలుపింత భీకరంగా, ఇంత పొద్దున్నే బాదుతున్నారని చిరాగ్గా లేచి వెళ్ళి తలుపు తెరిచాను.

ఎదురుగ్గా శాయిరామ్ నిలబడి ఉన్నాడు.

"హలో— గుడ్ మార్నింగ్" అన్నాడు నవ్వుతూ.

"గుడ్‌మార్నింగ్" అన్నాను కోపంగా.

"మన కాలనీలో ఎనిమిదింటికి




మీటింగుంది" అన్నాడు చిరునవ్వుతో.

"నాకు వళ్లు మండిపోయింది"

"మొన్నే కదా! దొంగల తాలూకు మీటింగయింది? అన్నాను చిరాగ్గా.

"అవును"

"అప్పుడు వాళ్ళూ మనం ఓ ఎగ్రిమెంట్ కొచ్చేంకదా!"

"వచ్చాం !"

"మరింకెందు కిప్పుడే మీటింగ్?

"ఇది ఎలక్షన్ మీటింగ్ !"

"ఎలక్షన్ మీటింగా?"

"అవును!"

"నీకేం పిచ్చెక్కలేదు కదా! మొన్నేగా ఎలక్షన్లయ్యాయ్?"

"అయాయ్ గానీ. అప్పుడు మన నియోజకవర్గం నుంచి గెలిచిన కాంగ్రెస్ (ఐబ్ల్యూ) అభ్యర్థి ఆత్మహత్య చేసుకున్నాడు. అందుకని బై ఎలక్షన్"—

"అరె! ఎందుకు ఆత్మహత్య చేసుకున్నాడుట?"

"తప్పక మినిష్టర్ అవుతాడని ఉన్న ఆస్తంతా ఖర్చు చేశాడట! మంత్రి పదవి దొరకలేదు. ఇంకేం చేస్తాడు పాపం!"

"అయితే ఇప్పుడు మనం మీటింగ్ ఎందుకు పెట్టుకోవాలి?"

"ఎందుకేమిటి? ప్రతి ఎలక్షన్ కి





మన కాలనీ వాళ్ళందరం కలసి మీటింగ్ పెట్టుకుని ఏ పార్టీకి ఓటు చేయాలో నిర్ణయించుకోవడం మామూలేగా?"

"ఇంకా నిర్ణయించుకొనేదేముంది? మన కాలనీ ఎప్పుడూ కాంగ్రెస్ (డబ్ల్యూ)కేగా వోటు వేసేది?"

"కానీ ఈసారి కొత్తపార్టీ వచ్చింది కదా? అందుకని మళ్ళీ ఓసారి డిస్కస్ చేసుకుంటే ..."

"కొత్తపార్టీ ఏమిటి?" ఆశ్చర్యంగా అడిగాను.

"కాంగ్రెస్ (జెడ్)"

"కాంగ్రెస్ జడ్డా ?"

"అవును!"




"అంటే ఈ కాంగ్రెసుల్లో అదే ఆఖరిదన్నమాట! ఇంక పార్టీ చీలేందుకు అవకాశం లేనట్లేగా!"

"ఎందుకు లేదూ?"

"ఎందుకేమిటి? ఇంగ్లీష్ లిపిలో అక్షరాలు జెడ్ వరకేగా ఉంది."

సాయిరామ్ నవ్వాడు.

"పిచ్చివాడా! రెండక్షరాలతో మళ్ళీ కొత్త సిరీస్ మొదలు పెట్టవచ్చుగా?"

నాకర్థం కాలేదు.

"అంటే?"

"అంటే కాంగ్రెస్ (ఎ.బి.) కాంగ్రెస్ (జెడ్-హెచ్) అలా లక్షల కొద్ది కాంబినేషన్లతో కోలెడు పార్టీలు ఏర్పాటు చేసుకోవచ్చు."

"నిజమే!" ఒప్పుకున్నాను.

"అయితే పద - త్వరగా మరి. ఎనిమిదింటికల్లా మీటింగ్ మొదలెట్టాలి"

వారానికో రోజు దొరికే ఈ రేషన్ నిద్రని వదులుకోడానికి నాకు మనసొప్ప లేదు.

"నాకొంచెం పని ఉంది గురూ! మీరు మీటింగ్ స్టార్ట్ చేసేయండి. తరవాత వస్తాను-" అన్నాను బద్ధకం మాడేస్తూ.

"అదేం కుదరదు. కాలనీ కమిటీ వైస్ ప్రెసిడెంట్ వయ్యిండి, నువ్ రాకపోతే అందరూ గొడవచేస్తారు-"

"సరే" అన్నాను గత్యంతరంలేక.



గంగ,యమున,సరస్వతుల సంగమం త్రివేణి
రుచి,సువాసన,పరిమళాల సమ్మేళనం
త్రివేణి
సుగంధ వక్కపొడి
TRIVENI
Choice of Millions
TRIVENI
Pride of India
TRIVENI
TRIVENI
TRIVENI
ప్రకృతి ప్రసాదించిన సుగంధ పరిమళ ద్రవ్యములతో
తయారుచేయుటలో దీనికి పోటి మరొకటి లేదు
PHONES 270 • 468
MFG BY
DESU VENKATA SUBBA RAO
TRIVENI NUT POWDER MFG CO
FORT ROAD
MACHILIPATNAM-521 001 A.P
BRANCHES
• VIJAYAWADA • HYDERABAD
• SECUNDERABAD • VISHAKAPATNAM
• KAKINADA • TIRUPATI
• RAJAHMUNDRY • WARANGAl
• BANGALORE • MADRAS

# రెండుజెళ్ళసీత

జంధ్యాల

ఇంకోసారి ఛస్తే కాలనీ కమిటీ పదవు లేమాత్రం వప్పుకోకూడదని అప్పటికప్పుడే నిర్ణయించుకున్నాను.

శాయిరామ్ వెళ్ళిపోగానే - నేను రెడీ అయి మీటింగ్ జరిగే చోటుకి చేరుకున్నాను. అప్పటికే శాయిరామ్ ఆర్గనైజింగ్ సెక్రటరీ కాబట్టి తానే దగ్గరుండి వేదిక, మైక్, షామియానాలు అన్నీ ఏర్పాట్లు చేయించేశాడు.

ఎనిమిదింటికి కాలనీలోని వాళ్ళు చాలామంది మీటింగ్ కొచ్చేశారు.

"కాలనీ కమిటీ ప్రెసిడెంట్ జనార్ధన్ గారు ముందు మాట్లాడతారు" అన్నాడు శాయిరామ్ మైక్ దగ్గర నిలబడి.

జనార్ధన్ మైక్ దగ్గర కొచ్చాడు.

"సోదరులారా! ఉన్న పార్టీలతోనే మనందరం నానా ఇబ్బందులూ పడుతూంటే గోరుచుట్టు పై రోకటిపోటులా ఇప్పుడు కాంగ్రెస్ (జెడ్) అవతరించింది. ఆ పార్టీ తాలూకు అభ్యర్థి నిన్నే మన కాలనీకొచ్చి మనం ఆయనకే ఓట్లు వేస్తే మన కాలనీలో ప్రతి ఇంటికీ ఓ ఇత్తడి బిందె ఇస్తానన్నాడు. కనుక మనం ఇప్పుడు పరిస్థితిని సమీక్షించాల్సిన పరిస్థితి ఏర్పడింది."

"ఇత్తడి బిందె ఏ సైజుది?' ఎవరో ఒకామె ఆడాళ్ళలో నుంచి అడిగింది.

"సైజు వివరాలు ఆయన మనకింకా అందజేయలేదని నేను మనవి చేస్తున్నాను-"

మిగతాపార్టీలవాళ్ళు ఏమంటున్నారు" మరొకావిడ అడిగింది ఆశగా.

"మిగతా వాళ్ళలో కాంగ్రెస్ (డబ్ల్యూ) వాళ్ళు మళ్ళీ అదివరకులాగానే ప్రతి ఓటుకి ఓ చెంబా ఫ్రీగా ఇస్తారు. టోకున అరడజను ఓట్లున్న ఇంటికి చెంబెకు తోడుగా స్టీలు గిన్నె కూడా ఇస్తారు. ఇక కాంగ్రెస్ (ఎక్స్) వాళ్ళు ప్రతి ఇంటికీ ఓ ప్లాస్టిక్ బకెట్ ఇస్తామంటున్నారు. కాంగ్రెస్ (క్యూ) వాళ్ళు - ఆ అభ్యర్థికి పౌల్ట్రీఫారమ్ ఉండడం చేత ప్రతి ఇంటికీ ఓ అమెరికన్ బ్రాయిలర్ చికెన్ ఇస్తారట. ఒకవేళ ఎవరయినా కోడి తిననివారుంటే వాళ్ళకి కోడికి బదులుగా కోడిగుడ్లు ఇచ్చేస్తారు. కాంగ్రెస్ (జి) వాళ్ళు ప్రతి ఓటరుకీ పదకొండు గాలన్ల గుడంబా పోస్తారట. కనుక—"

అతని మాట పూర్తి కాకుండానే ఒకావిడ లేచి నిలబడింది.

"మిగతా పార్టీలు ఇస్తామంటున్న సామాన్లన్నీ ఇదివరకు ఎలక్షన్లలోనే సమకూర్చుకున్నాం. ఇంతవరకూ




ఎవరూ ఇత్తడిబిందె ఇవ్వలేదు కాబట్టి మన ఓటు కాంగ్రెస్ (జెడ్) కేసేద్దాం"

దాంతో అంతా రణగొణ ధ్వనులు మొదలయ్యాయ్.

"ఆ బిందె సైజు తెలుసుకోందే మాకెలా ఇస్తా...?" అని ఒకరు.

"నా చీరలన్నీ బొత్తిగా చిరిగి పోయాయ్ పిన్నిగారూ! బిందె బదులు నాలుగు చీరలిమ్మంటే ఇవ్వరంటారా" అని ఇంకొకావిడ.

"కిందటిసారి వాళ్ళిచ్చిన స్టీలు చెంబాలు తుప్పు పట్టిపోయాయ్. ఆ నచ్చినోళ్ళను ముందా చెంబెలు వాపస్ తీసుకొని మంచివి ఇమ్మని కబురు చేయండి" అని ఇంకొకావిడ.

"అవునవును. ఎంత కాలం ఈ చిల్లర బేరాలు ?" ఇంకెవరో సపోర్ట్ చేశారు.

నేను గొంతు సవరించుకున్నాను.

"అంత ఖరీదయినవి ఎవరిస్తారు? ఒక్కొక్క ఇంటికీ ఓ టి.వి. సెట్టంటే చూడండి మరి - కనీసం రెండు కోట్ల రూపాయలు ఖర్చు చేయాల్సి ఉంటుంది వాళ్ళకి. అదెలా సాధ్యం?" అన్నాను నచ్చ చెప్తూ.

"ఏం మా య రో గ మె మి టి?



# రెండు జెళ్ళ సీత

జంధ్యాల

ఈ రణగొణ ధ్వనిలో నుంచి ఒకా విడ కంఠం ఖంగుమని మోగింది.

"అని వస్తువుల ధరలూ పెరిగి పోయాయ్. ఇంకా ఈ బిందెలూ, చీరలూ, చెంచాలూ ఏమిటి నా మొఖం. టి.వి. సెట్లుగానీ, స్టీలు అల్మారాలు గానీ ఇవ్వమని అడగరాదూ? సిమెంటు కుంభకోణాల్లోనూ, ప్రభుత్వ భూముల కుంభకోణాల్లోనూ ఇంక ఇతరత్రా ఇంతకు పాతికరెట్లు సంపాదించు కోరా?" విరుచుకుపడిందొకావిడ.

"సంపాదించుకున్నా గానీ - వాళ్లు ఖర్చు చేయరు-" నన్ను సమర్థిస్తూ అన్నాడు జనార్ధన్.

"చేయకపోతే పోనీండి. మన ఓటు కూడా వాళ్ళకేయం" అందా మె మొండిగా.

ఆడాళ్ళతోనూ, పోలీసుల తోనూ ఎప్పుడు వాగ్వివాదం పెట్టుకోకూడదని మా కాలనీ గోపాత్రా- చెప్పిన విషయం నాకు గుర్తుకొచ్చింది. అంచేత ఆ విషయం జనార్ధన్‌కికూడా గుర్తు చేశాను.

అతను వెంటనే సైలంటయి పోయాడు.

ఈలోగా ఓ టాక్సీ వేగంగా వచ్చి ఆగిందక్కడ. అందరం ఆశ్చర్యంగా అటువేపు చూడసాగాం. 'క్సీలోంచి మా కాలనీలోనే ఉంటున్న శ్యామ [లావు ఖద్దరు చొక్కా, పంచెతో దిగి చిరునవ్వుతో మా అందరికీ నమస్కారం చేశాడు. అందరికీ మతిపోయి నట్లయింది ఆ అవతారం చూసి.

"శ్యామ[లావుగారికీ జై" అంటూ వెనుకే వాళ్ళ పెద్దబ్బాయికూడా దిగాడు.

శ్యామ[లావు చిరునవ్వుతో వేదిక మీదకు వచ్చి నిలబడి జనార్ధన్‌తోనూ, శాయిశామ్‌తోనూ, నాతోనూ కరచాలనం చేశాడు.

"తమరు అనుమతిస్తే నా ఓటర్లకు ఓ అభ్యర్థన చేస్తాను" అన్నాడు చిరునవ్వుతో.

"మీ ఓటర్లేమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు జనార్ధన్.

"మీరంతా నా నియోజకవర్గంలోని ఓటర్లేకదా! కనుక మన కాలనీఓట్లన్నీ నాకే వేయడం న్యాయమని మనవి చేస్తాను" చిరునవ్వుతో అన్నాడు.

ఆ చిరునవ్వు చూస్తూంటే నేను చూస్తున్నది కలో నిజమో అర్థం కావటం లేదు నాకు. నేను ఆ కాలనీలో గత పదేళ్లుగా ఉంటున్నాను. ఈ పదేళ్ళలో ఏ ఒక్కరోజు కూడా నవ్వటం ఎవ్వరూ చూడలేదు.

"అంతే.... అంతే.... మీరు ఎలక్షన్లో ...."

"అవునాయినా ! మన నియోజక వర్గం నుంచి పోటీ చేస్తున్నాను-" అప్పుడే పుణ్యక్షేత్రాలన్నీ సందర్శించి వచ్చిన పెద్దమనిషిలా శాంతంగా అన్నా డతను.

మా సంభాషణ అంతా మైక్‌లో అందరికీ వినబడుతూండడం వల్ల సభలో కలకలం బయల్దేరింది.

"సోదరులారా ! మీకు నన్ను నేను పరిచయం చేసుకోవాల్సిన అవసరం లేదని నాకు తెలుసు. ఎందుకంటే నేను మీ వాడిని. ఊలో పుట్టి పెరుగుతున్న

## రెండు జెళ్ళ సీత

జంధ్యాల

మన కాలనీవాడిని. ఈ ఎలక్షన్లో నేను కూడా ఎమ్మెల్యేగా పోటీ చేస్తున్నానని మీ అందరకూ తెలియ జేయడానికి ఎంతో సంతోషిస్తున్నాను. నిజానికి నాకసలు రాజకీయాలంటే మీ అందరి లాగానే చిరాకు. కానీ ఈ రోజున మన దేశంలోని అస్తవ్యస్త పరిస్థితులు చూశాక గుండె ద్రవించిపోయి ఒక్క దూకు దూకాను. కనుక నన్ను మీరం

దరూ తప్పక ఎన్నుకుంటారని ఆశిస్తు న్నాను. నన్ను ఎన్నుకుంటే 107 - ఎ నెంబర్ బస్ని కాలనీ లోపలి వరకూ లాక్కొస్తాను. పైప్స్‌లో మంచినీళ్లు దొరికే టైముని అర్ధరాత్రి నుంచి ఉదయం మూడింటికి మార్చేస్తాను— ఇంకా ఇలాంటివి బోలెడు చేస్తాను." అంటూ ఆ తరవాతేం చెప్పాలో తెలీక ఆగాడతను.

"ఇంతకూ మీరేమిస్తున్నారు మరి? బిందెలా, చీరలా?" ఒకావిడ అడిగింది మధ్యనుంచి.

"అమ్మా! మీకో నమస్కారం. నాకంతటి తాహతు లేదు. నేనేమీ ఇవ్వలేను"

"మరి అవతలి వాళ్లు అవన్నీ ఇస్తుంటే ఎవరొదులుకుంటారు?"

"అయ్యో! వదులుకోమని ఎవరన్నారమ్మా. ఎవరేమిస్తే అది తీసుకోండి. ఎలక్షన్లుండగానే ఇల్లు చక్కబెట్టుకోమన్న సామెత ఉండనే ఉంది గదా. అందరి దగ్గరా అన్నీ తీసుకుని ఓటు మాత్రం నాకు వేయండి. నాలాంటి బీదాడికి ఓటు దానం చేస్తే ఎంతో పుణ్యం మీకు. దానాలన్నిటిలోకీ 'ఓటుదానం' గొప్పదని మన శాస్త్రాలు ఘోషిస్తూనే ఉన్నాయికదా".

అందరూ చర్చించుకోవడం మొదలెట్టారు. చర్చ ముగిసేవరకూ అతను నమస్కారం పెడుతూ అలాగే ఉండిపోయాడు.

చివరకు అందరూ కలసి శ్యామ్రావుకే ఓటు వేయాలన్న నిర్ణయాని కొచ్చారు.

ఆ నిర్ణయం విన్నవెంటనే శ్యామ్రావు ఆనందంతో పొంగిపోయాడు.

"నాకు చాలా సంతోషంగా ఉంది. మన కాలనీ ఓట్లంటే మాటలు కాదు. షుమారు అయిదువేల ఓట్లు. నేనింక ఎలాంటి ఢోకా లేకుండా గెలుస్తాను. నమస్తే - నమస్తే" అంటూ నమస్కారాలు చేసుకుంటూ టాక్సీ దగ్గరకు వెళ్ళాడు. వెనుకే అతని కొడుకు "శ్యామ్రావుగారికీ జై" "దేశ్ కీ నేతా - శ్యామ్రావ్ బన్‌తా" "ఇండిపెండెంట్ అభ్యర్థి శ్యామ్రావ్ - జిందాబాద్-" అని అరుచుకుంటూ వెళ్ళాడు.

టాక్సీ వెళ్ళిపోగానే జనార్దన్ మళ్లీ మైక్ దగ్గర కొచ్చాడు.

"కాలనీ వాళ్ళందరం కలసి శ్యామ్రావు గారికే ఓటు వేయాలని నిర్ణయించడం నిజంగా చాలా గొప్ప విషయం. శ్యామ్రావుగారు డబ్బుకి బీదాడే




గాని చదువులో కాదు. ఆయన రెండు సార్లు బి. ఏ. పాసయ్యారు. ఓసారి కార్పొరేషన్ ఎలక్షన్లో నుంచుని ఓడిపోయారు గనుక రాజకీయ అనుభవం కూడా ఉంది."

అతనలా మాట్లాడుతూండగానే మరో అరడజను టాక్సీలు వచ్చి ఆగాయ్ అక్కడ. మొదటి టాక్సీలో నుంచి ఎర్ర టక్కీ బనీనూ, పచ్చ పాంటూ వేసుకున్న నల్లని లావుపాటి ఆకారం దిగింది. ఆ ఆకారం వెనుకే మరికొన్ని ఆకారాలు పంచరంగుల బనీన్లూ, దుబ్బు జుట్లూ, చేతుల్లో కత్తులూ, చైన్లతో దిగారు. ఒక్కొక్కరే రొమ్ము విరుచుకుని నడుస్తూ అక్కడ షామియానాలో ఉన్న మా గస్తీ పోలీసుల్లా నిలబడ్డారు.

"ఈ కాలనీ ప్రెసిడెంటెవరు వయా ఈడ?" అంటూ ఓ పచ్చ బనీను నా దగ్గరకొచ్చి అడిగాడు.

"ప్రెసిడెంటా- అదుగో- వారే!" అంటూ జనార్దన్ని చూపించాను.

"ఏయ్ ప్రెసిడెంటూ- జరా బయట కొచ్చి శంకర్ దాదాని కలువ్!" అన్నాడతను జనార్ధన్తో.

"శంకర్ దాదానా?" ఉలిక్కిపడి అడిగాడు జనార్దన్.

"అవ్!"

## రెండు జెళ్ళ సీత

జంధ్యాల కేశవరావు

# రెండు జెళ్ళ సీత

జంధ్యాల కేశవరావు

అందర మొఖ మొఖాలు చూసు కున్నాం.

శంకర్ దాదా అంటే మాఏరియాలో తెలీనివారు లేరు. వాడు చేసే కిరాత కాలు అందరికీ తెలుసు.

ఎప్పుడూ తన గాంగ్ ని వెంబడేసు కుని రోడ్లమీద అడ్డుకడ్డ వాడినల్లా పొడుస్తూ, ఉంగరాలు, గడియారాలు, డబ్బు లాక్కు పోవడం చాలా మామూలు విషయం.

"ఇప్పుడు.... నా. నా నా.... తో ఏమిటి ఏ....ఏ....ఏ.... పని?" అంగా రుగా అడిగాడు జనార్ధన్.

"గట్ల వరెషానెందు కవుతున్నవ్. శంకర్ దాదా జర్ర నీతో మాట్లాడాల్నని వచ్చిండు వయా. నడుమల్లా!"

"అలాగే. పదండి! రు కూడా రం వెల్దాం!" అన్నాడు జనార్దన్ మావంక చూస్తూ.

ముగ్గురం కలపి శంకర్ దాదా దగ్గర కెళ్లాం.

"నమస్కారమండీ! నేనే జనా ర్ధన్ ని." వినయంగా అన్నాడు జనార్దన్

"నమస్తే అన్నా! నిన్ను కలవాల్నని నాల్గుదినాలకెళ్ళి కోషిష్ చేస్తున్న!" అని షేక్ హాండిచ్చి నా వంక చూసి "నువ్వెవరు?" అనడిగాడు.

"నా పేరు ఉదయార్కర్!"

"నీ పేరు గాదువయ్యా అడిగెదిది. నువ్వెవరు అనడుగుతున్న!"

"అదా. అదీ. నేను కాలనీ వైస్ ప్రెసిడెంట్ నండీ!" వినయంగా అన్నాను.

"నీయవ్వ. గట్ల చెప్పరాదువయ్యా! నాకు తెలియకనేపాయె, ఏదీ. చెయ్ కలుపు." అంటూ చేయ్ జాపాడు.

అయిష్టంగానే కరచాలనం చేశాను.

"నేను కాలనీ కమిటీ ఆర్గనైజింగ్ సెక్రటరీ నండీ!" ఎందుకయినా మంచి దని అడగకముందే చెప్పేసుకున్నాడు శాయిరామ్.

"నీయవ్వ- మంచి గయింది— అందరు ఈడనే జమయిన్రు!" చెయ్ కలుపు అంటూ శాయిరామ్ తో కూడా కరచలన జేశాడు.

"అది సరేగాని, నేనిప్పుడు ఈడకి ఎందుకొచ్చినానోఎరుకనా?" జనార్దన్ ని అడిగాడతను".

"తెలీదండీ!"

"నేను ఎలక్షన్ల ఎమ్మెల్లేగా నిల బడినా. సమజయిందా! అగో. అపని. మీదనే ఈడకొచ్చినా! మీరు నాకు జర్ర మదద్ చేయండ్రి భాయ్- మీ కాలనీ




ఓళ్ళందరూ- మీ మాటకు ఇజ్జతి స్తరని మా గాంగోళ్లు చెప్పిండ్రు!" ముగ్గురం షాక్ తిన్నట్లయిపోయాం!

"అలాగే నండి. అందరికీ చెప్పి తప్పక మీకే వేయిస్తాము-" అన్నాడు జనార్దన్ షాక్‌నుంచి త్వరగా తేరుకుని.

"అయితే నడుమల్లా! మైక్‌ల నేను గూడ జర మాట్లాడ్నీకి కొషిష్ జేస్త!" అంటూ మైక్ దగ్గరకు నడవసాగాడు. ముగ్గురం అతని వెనుకే నడిచాము. "సోదర సోదరీమణులారా, ప్రస్తుతం అర్జంటుగా ఓ విషయం మనవి చేయ దల్చుకున్నాను. మన నియోజక వర్గం నుంచి శంకర్‌దాదా కూడా పోటీ చేస్తున్నట్లు ఆయనే స్వయంగా ఇక్కడి కొచ్చి తెలియజేశారు. శంకర్‌దాదా గురించి నేను మీకు చెప్పాల్సిందేమీ లేదు. ఆయన పేరు చిన్న పిల్లల క్కూడా తెలుసు. కనుక మన ఓట్లన్నీ ఆయనకే వేయాలని ఆయన కోరుతున్నారు. ఇప్పుడు శంకర్‌దాదా మాట్లాడతారు-" అనేసి పక్కకు జరిగాడు జనార్దన్.

శంకర్‌దాదా మైక్ దగ్గర కొచ్చి అందరికీ నమస్కారం పెట్టాడు.

"ఈడు నోళ్ళందరికీ సలాం జెప్తున్న. జనార్దనన్న నా గురించి మీకు మంచిగ చెప్పిండు. ఈడునోళ్ళల్ల కొంతమంది సోంచాయిస్తుండొచ్చు.



# రెండు జెళ్ళ సీత

జంధ్యాల

"దాదాగిరీ చేసేటోడు- ఎమ్మెల్లేగ ఎట్ల నిలబడ్డాడు అని,"

"నిజం వయ్యా, నేను మర్డర్లు చేసిన, దొంగతనం జేసిన, జైలు కెళ్ళిన, రేప్‌లు చేసిన, కానీ ఇన్ని దినాలు మనదేశం పరిపాలించే టోండ్లలో ఇవన్నీ చెయ్యనోళ్ళెవరు? మంచిగ సోంచాయించండ్రి. ఇయ్యాళ్ళ పేపర్లలో చూస్తున్రు గదా. సిమ్మెంటమ్ముకునే టోడొకడు, ప్రభుత్వం బూము లమ్ముకునేటోడొకడు, డాక్టర్ల కొలువు లమ్ముకునేటోడొకడు- గిట్ల మినిష్టర్లందరూ దందాలు జేస్తున్రు. గిసంటోళ్ళకు ఓట్లు వేస్తారు వయ్యా? నిన్నుగిట్ట మీరు గెలిపించిన్రంటే- ఖసమ్‌తోటి జెప్తున్న- నేను ఈ మర్డర్లు చేసెడిది, దొంగతనాలు, రేప్‌లు చేసెడిది- అన్ని ఇడిచిపెడత. ఏం జెప్తున్న? సమజయిందా. ఇంక నేను పోవాల్నా మల్లా?"

ఎవ్వరూ ఏమీ మట్లాడ లేదు. అందరూ భయంతో గుడ్లప్పగించి చూస్తూండిపోయారు.

"అచ్ఛా మైజారవూ అన్నా. ఈళ్ళందరితో ఓట్లెయిపించే జుమేదారి మీది. ఏమంటున్న. నాల్గు దినాలు అయినాక వస్త మల్లా." అనేసి వెళ్ళిపోయాడతను. మరుక్షణంలో టాక్సీలన్నీ వెళ్ళిపోయినయ్.

"ఏమిటి? రౌడీ వెధవకు మనం ఓట్లెయ్యాలా? అయ్యో ఏం కాలమొచ్చింది."

"ఇలా ఎవడుబడితే వాడే నిలబడితే ఎలా?"

"మన కాలనీలో అందరూ గ్రాడ్యుయేట్లు, పోస్ట్ గ్రాడ్యుయేట్లు ఉంది- అందరూ కలసి అక్షరం ముక్కరాని రౌడీకా ఓట్లువేసి గెలిపించడం-" ఇలా రకరకాల వ్యాఖ్యలు గుప్పుమని చెలరేగాయ్ శంకర్‌దాదా వెళ్ళిపోగానే. శాయిరామ్ మైక్ దగ్గర కొచ్చాడు.

"సోదర సోదరీమణులారా, ఇప్పుడు అనుకోని పరిస్థితి ఎదురయింది మనకి. శంకర్‌దాదా ఓట్లు తనకే వేయమని వార్నింగిచ్చాడు. వేయకపోతే ఏం జరుగుతుందో మనందరం తెలిగ్గా ఊహించవచ్చు. వాళ్ళ గాంగ్ వాళ్ళందరూ కత్తులు తీసుకుని మన కాలనీ అంతా స్వైరవిహారం చేసేస్తారు. అంచేత మనం ఇంతకుముందు శ్యామ్‌లాల్‌గారి కిచ్చిన మాట ఉపసంహరించుకుందాం. ఏమంటారు?" యాదగిరి లేచి నిలబడ్డాడు.

"మీరూరికే పరిషానవుతున్నారు

గానీ మనం వాడికి వోటు వేయలేదన్న విషయం శంకర్‌దాదా కెలా తెలుస్తుంది?"

"పిచ్చాడి లాగున్నావ్- మన కాలనీ పక్కనున్న పోలింగ్ బూత్‌లో వోట్లు లెక్కెట్టేప్పుడు తెలీదూ?"

"తెలుస్తే ఏం జేస్తాడంటావ్?"

"కత్తులు- స్వైరవిహారం- మనలో వెయ్యిమందికి కత్తిపోట్లు, పాతిక మంది దుర్మరణం- ఇలా సాగిపోతుంది ఆ మర్నాటి పేపర్లో వార్త."

అందరూ నిశ్శబ్దం అయిపోయారు మీటింగ్ అర్థాంతరంగా ముగిసిపోయింది.

"సోదరులారా. తిరిగి మనందరం వచ్చే ఆదివారం ఇక్కడ కలుసుకుని ఎవరికి వోటు వేయాలో ఫైనల్‌గా నిర్ణయించుకుందాం." అన్నాడు శాయిరామ్.

అందరూ ఎవరిళ్ళకు వాళ్ళు బయల్దేరారు.

నాల్రోజులన్నా అవకముందే కాలనీ వాళ్ళందరూ బలవంతంగా అర్ధరాత్రి సమావేశం జరపాల్సి వచ్చింది. అందుక్కారణం సిరాజుద్దీన్ అనే




అభ్యర్థి. అతగాడు తన తాలూకా పంచమంది అనుచరులతో కాలనీని చుట్టుముట్టి అందరికీ కర్రలు చూపి లాక్కొచ్చారు. శాయిరామ్ కళ్ళు నులుముకుంటూ సమావేశం ప్రారంభించాడు.

"సోదరులారా మన నియోజకవర్గం నుంచీ పోటీచేస్తున్న అభ్యర్థి శ్రీ సిరావుద్దీన్ గారి విన్నపంవల్ల - మనం అర్జంటుగా -"

"విన్నపం గాదువయ్యా - జబర్దస్తీ చేసినా గట్ల చెప్పనీకి భయమేమున్నది?" అన్నాడు సిరాజుద్దీన్ పౌరుషంగా.

"ఆ. అదే బలవంతంగా మన నిక్కడ సమావేశపరచడానికి కారణం ఏమిటంటే మన కాలనీ వాళ్ళందరూ ఆయనకే ఓట్లు వేయాలని ఆయన అభ్యర్థిస్తున్నారు -"

ఇగో - గదే గలత్‌మాట. నాకేం గర్జ్ వయ్యా బతిమాలానికి. జబర్దస్ చెప్తున్న. పూరా వోట్ నాకే ఎయ్యాల్న ఏమంటున్న. ఎయ్యకుంటే కత్తితో కిరికిరవుతది. సమజ ఖుందా?"

"ఆ, అయిందిసార్,"

"అయితే నాగురించి, నే ంతకు ముందు చేసినదంతా గురించి కూడా చెప్పు ఆళ్ళకు-" అన్నాడు సిరాజుద్దీన్.




"సోదరులారా. సిరాజుద్దీన్ గారి గురించి మీకు వేరే చెప్పనవసరంలేదు. ఆయనకూడా చిన్నప్పటినుంచీ జైలు కెళ్తూనే ఉన్నారు. ఈ రోజున కూడా జానికి జైల్లోనేఉండాల్సిందిగానీ మనఓట్ల కోసం జామీనులో వచ్చారు ఆయన అంతర్రాష్ట్రీయ జేబుదొంగ అన్న విష విషయం మీరు పేపర్లలో చూసే ఉంటారు. లేదా అనుభవ పూర్వకంగా నయినా గ్రహించి ఉంటారు. కేవలం తను ఒక్కడే 'సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్' స్కీమ్ క్రింద ప్రారంభించిన అతని 'పిక్‌పాకెట్' సంస్థ నేడు అనేకవేల మందిసభ్యులతో కిటకిటలాడిపోతోంది. అప్పుడు సంవత్సరానికి పాతికవేలు టర్నోవర్ ఉంటే ఇప్పుడది ఇరవై కోట్ల రూపాయలకు చేరుకుంది సిరాజుద్దీన్‌గారిది మంచి మనసు అనడానికి నిదర్శనం - ఆయన ఆ సంస్థద్వారా ఎంతో డబ్బు ఇంకా సంపాదించే అవకాశం ఉన్నా - ఆ వృత్తిని మానేయడం నిజంగా ఎంతో గొప్ప విషయం ఇది. కామధేనువు లాంటి వృత్తినెవరయినా వదులుకోగలరా - ఒక్క సిరాజుద్దీన్‌గారు తప్ప."

అందరూ తప్పట్లు కొట్టారు.

"ఇగో— తాళి బజాయించితే నేను



# రెండు జెళ్ళ సీత

జంధ్యాల   కేశవరావు

ఖుష్ అవుతానుకోకం[డి. కాలనీలోని ఓట్లనీ్ని నాకే పడాల్స. ఇయ్యాల్టి నుంచి ఈ కాలనీలోకి ఇంకెవళ్ళూ రాకుండా మా షాగిర్దీల్ని పహరా పెడ్తన్న- ఇంకెవళ్ళ మాటా ఇనకం[డి. ఇంకెవళ్ళకీ వోటేయకం[డి. సమజయిందా?"

"అయింది." అన్నాయి కొన్ని గొంతులు.

"ఇకపోం[డి, వోట్ల ఇసయంల నకరాలు చేస్తే మా[తం కత్తితో కిరికింపుతది."సిరాజుద్దీన్ వెళ్ళిపోయాడు

అతని శిష్యులు ఇద్దరు మా[తం అక్కడే గస్తీ తిరగసాగారు అందరం నిశ్శబ్దంగా ఎవరిళ్ళకు వాళ్లు చేరుకున్నాం.

ఆదివారం రానేవచ్చింది.

కాలనీ వాళ్ళందరూ సమావేశానికి హాజరయారుగానీ ఎవరిమొఖాన్నా కళ లేదు. ఎవరూ బిందెల గురించీ, స్టీలు గిన్నెల గురించీ చీరల గురించీ మాట్లాడడం లేదు.

'సోదరసోదరీమణులారా: ఎవరెంత బెదిరించినా మన కాలనీ ఓట్లన్నీ కాద్దో గొప్పో చదువూ సంస్కారం ఉన్న శ్యామ[రావ్‌గారికే వేయాలని అందరూ అభి[పాయం వెలిబుచ్చారు" అని జనార్దన్ చెప్పగానే అంతటా చప్పట్లు మార్మోగిపోయాయ్. సరిగ్గా అప్పుడే టాక్సీలోంచి దిగాడు శ్యామ[రావ్.

ఆయన వెనుక ఆయన కొడుకు "ఈరిగాడూ జిందాబాద్"అని అరుస్తూ మామధ్యకొచ్చాడు.

అందరూ నిర్ఘాంతపోయారు. శ్యామ[రావ్ చిరునవ్వుతో మాట్లాడసాగాడు.

"సోదర సోదరీమణులారా, నేను కాం[గెస్ (జెడ్) అభ్యర్థి అయిన ఈరిగాడిని బలపరుస్తూ పోటీనుంచి విరమించుకుంటున్నానని తెలియజేయడానికి సంతోషిస్తున్నాను. కనుక మీ అందరి వోట్లుకూడా ఈరిగాడికే వేస్తారని ఆశిస్తాను-" అనేసి నమస్కారం చేసి వెళ్ళిపోయాడు.

అందరి మొఖాలూ పాలిపోయాయ్.

"మోసం. దగా. ఈరిగాడి దగ్గర పాతికవేలు కొట్టేసి విత్[డా అయిపోయాడు" అన్నాడు శాయిరామ్.

"ఆ( పాతికవేలు కొట్టేశాడా?" అరచారు అందరూ.

"అవును. నిన్న ఈరిగాడి మనుషులే స్వయంగా చెప్పారు గానీ నేను




నమ్మలేరు-" కొద్దిసేపు అంతా కోలాహలంతో నిండిపోయింది.

కేవలం పాతికవేలే కాదు. ఎలక్షన్లో నిలబడ్డ ప్రతి అభ్యర్థికీ గవర్నమెంటు ఇచ్చే న్యూస్‌ప్రింటూ, పెట్రోలూ, వోటర్స్ లిస్టులు, టెలిఫోన్ సౌకర్యం ఇవన్నీకూడా శ్యామ్రలాప్‌గారు బ్లాకులో అమ్ముకుని లక్ష రూపాయలవరకూ సంపాదించాడని, ఆ తరువాత ఆయన కొన్న ఇల్లూ, చేసిన కూతురి పెళ్ళీ ఋజువు చేసాయ్.

కొద్దిసేపు అంతా కోలాహలం—

"ఇంతకూ ఇప్పుడూ మన ఓటు ఎవరికి?" అడిగారు కొందరు.

"ఈరిగాడికే వేస్తే సరి" నేను సలహా ఇచ్చాను.

"నీకెంత ఇచ్చాడు వాడు?" ఎవరో అరచారు. నేను సైలెంటయి పోయాను.

"ఈరిగాడా! వాడు చేసేది సారా వ్యాపారం. కల్తీసారాతో ఆ మధ్య అరవై మందిని చాపా కట్టించాడు. వాడు ప్రజా ప్రతినిధా?"

"వద్దు-వద్దు" అని అరచారు కొంత

## రెండు జెళ్ళ సీత

జంధ్యాల కేశవరావు

శ్రీ భ్రమరాంబికా ఫిలింస్

## రెండు జెళ్ళ సీత

కేశవరావు

మంది స్త్రీలు.

"పోనీ కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి అంగముత్తుకి వేద్దామా?"

"వాడికా! వాడు రోడ్డుమీద కనబడ్డ ఆడాళ్ళ మంగసూత్రాలు లాక్కుని పారి పోతాడు కదా."

"పోనీ కాంగ్రెస్ (పి) అభ్యర్థి సంగతేమిటి?"

"వాడికసలు చదువే లేదుగా! బండిలో కూరగాయ లమ్మేవాడు!"

"అయితే ఇండిపెండెంట్ అభ్యర్థి రామ్‌సింగ్ మాటేమిటి?"

"వాడా? వాడి దగ్గర నుంచి మొన్నేగా పోలీసులు స్మగుల్డ్ సామాను పట్టుకుందీ?"

దాంతో జనార్దన్‌కి చిరాకేసు కొచ్చింది.

"సోదరులారా! ఇలా అందరికీ వంకలు పెట్టటం నాకేం నచ్చలేదు. మన దేశంలో ఎలక్షన్లో నిలబడే వారం దరూ ఇంచుమించుగా ఇలాంటి వారే! వాళ్ళల్లోనే మనఓటు ఎవరోకరికి వేయక తప్పదు." అన్నాడు విసుగ్గా.

అందరూ మళ్ళీ తర్కంలో పడ్డారు. చివరకు అందరూ కలసి జనార్దన్‌కే ఆబాధ్యత అంటగట్టారు.

మా నియోజక వర్గంలో నిలబడ్డ వారందరిలోనూ ఎక్కువ చదువుకున్న వాడూ, తక్కువ మర్డర్‌లూ, రేప్‌లూ, జేబు దొంగతనాలూ, స్మగుల్డ్ వ్యాపా రం చేసే వాడూ అయిన అభ్యర్థి పేరు సూచించాల్సిందిగా ఆదేశించారు.

వాళ్ళ ఆదేశం మేరకు మేము ముగ్గు రం అన్ని పోలీస్టేషన్లకూ వెళ్ళి అతి తక్కువ నేరాలు చేసిన అభ్యర్థి పేరు గాలించి విజయం సాధించాం!

మా నియోజక వర్గంలో పోటీ చేస్తున్న వాళ్ళందరిలోకి శంకర్‌దాదా ఒక్కడే అందరి కంటె ఎక్కువగా చదువుకున్నాడు. (రెండో క్లాసు) అలాగే అతనొక్కడే అతితక్కువ మర్డర్‌లు చేశాడు (రెండొందల ఆరు). అతి తక్కువ రేప్‌లు చేసింది కూడా అతనే (పదహారు). అతితక్కువ కాలం జైల్లో ఉన్నది కూడా అతనే (ఆరేళ్లు). మరి చూస్తూ చూస్తూ వాడికెలా ఓట్లు వేస్తాం? కాని వోపక్క శంకర్‌దాదా కత్తులతో కాలనీ అంతా స్వైరవిహారం చేసే దృశ్యం కూడా మా కళ్ళముందు కనబడుతోంది. చివరకు ఎవరికీ వోటు వేయగూడదని నిర్ణయించుకున్నాం!

అయితే ఈ విషయం ఎలా తెలి


జలుబూ,
పడిశెంతో పాపకి కంటికి కునుకులేదు
విక్స్ వేపోరబ్‌తో యిక ఆ రాత్రే హాయిగా నిద్ర పట్టింది
(అప్పుడే మరి తల్లి మమత కనిపించేది)
ఈ జలుబుతో వచ్చిన తిప్పలేమిటంటే, తన దాకా వస్తేనేగాని తెలియదు మరి. అవడానికి మామూలు జలుబే, కాని దాంతో రాత్రంతా నిద్రకి నోచుకోదు. ఇక ముక్కు దిబ్బెడ వెయ్యడం, కారడం, తుమ్ము-తుమ్ముకుని దగ్గు, ఒళ్ళంతా నెప్పులూను. పడిశెం పడి రోగాల పెట్టు! పసిపాప ఎలా భరించ గలదు గనక! అటువంటప్పుడేగదా తల్లి ఆపేక్ష, చల్లని చేతుల చమత్కారం కనిపించేది–పాప ముక్కుకి, గుండెలకి, గొంతుకి, వీపుకి ఆ ఆపేక్షతో విక్స్ వేపోరబ్ రాసినప్పుడు. ఆ....వీపుమీద విక్స్ వేపోరబ్ రాయడం మర్చిపోకండేం? అలా చెయ్యకపోతే, మీరు పడ్డ శ్రమంతా అమాత్రంగానే ఉండిపోతుందిక! మమతతో నిండిన మాలీసుతో తన క్రియని ప్రారంభిస్తుందిక. దీనిలోని ఔషధీయుక్తమైన ఆవిరితో ముక్కుదిబ్బెడ పోతుంది, మరి దాంతోనే శరీరంపైన దీని ప్రభావంతో ఒంటినెప్పినుంచి ఉపశమనం కలుగుతుంది.
ఈ రకంగా మమతతో నిండిన ఉపచారంతో పాప హాయిగా నిద్రపోతుంది, ఇక ప్రొద్దున్నే కళ్ళు తెరవగానే మునపటిలాగా కులాసాగా వుంటుంది.
VICKS
VapoRub
ఏదైనా లక్షణం, ఏదైనా కారణం కానివ్వండి,
జలుబుకి మాత్రం విక్స్ వేపోరబ్ రాయండి

సిందో గాని సిరాజుద్దీన్‌కి తెలిసింది. ఆ రాత్రి అతగాడు మా కాలనీ కొచ్చి అందరినీ అర్జంటుగా బయట సమావేశ పరచేశాడు.

"ఖబడ్దార్! ఓట్లు నాకేస్తామని వాదాచేసి గిప్పుడు పల్టాయించిపోతారు? నీయవ్వ- మీకు మంచిగ బుద్ధి జెప్త! నేనెసుంటోడ్నో మీ కెరుక లేదు!" అంటూ వార్నింగిచ్చాడు.

ఎవ్వరం మాట్లాడలేదు.

"అగో! మాట్లాడరు? సరేబిడ్డా! నేన్జూసుకుంట! పదండ్రి!" అనేసి కోపంగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఎవ్వరికీ నిద్రలేదు. భయం!

తెల్లారు జామున ఎవరో కెవ్వున కేకలు పెట్టేసరికి అందరం ఉలిక్కిపడి లేచి బయటకు పరుగెత్తాం!

తీరా చూస్తే రాజేశ్వర్‌కి కలవచ్చిందట- తనని సిరాజుద్దీన్ చంపుతున్నట్లు- అందుకని వెర్రికేకలు పెట్టాడట.

ఎలాగోలా తెల్లారింది.

అందరం వోటింగ్ చేయడానికి బయల్దేరాం గానీ కాలనీ బయట సిరాజుద్దీన్ శిష్యులు కర్రలు తీసుకుని నిలబడి కనిపించారు.

"ఏయ్! సాయింత్రం వరకూ కాలనీ వోళ్ళెవరూ బయటకు రాకండ్రి! వచ్చిన్రో కిరికిరివుతది!" అన్నారు బెదిరింపుగా.

వాళ్లతో గొడవెందుకని అందరం మళ్ళీ ఇళ్ళల్లో కొచ్చేశాం.

తీరా మధ్యాహ్నం రెండవుతుండగా కాలనీ అంతా శంకర్‌దాదా తాలూకూ రౌడీలు నిండిపోయారు.

"నీయవ్వ! మంచిగచెప్తె ఇనరుబే! లేండ్రి! నడవండ్రి ఓట్లెయ్యనీకి!" అంటూ అరవసాగారు.

"అయ్యో. వోట్లేస్తే సిరాజుద్దీన్ మమ్మల్ని చంపుతా నంటున్నాడండీ" అన్నాడు జనార్దన్.

"ఇగో- ఇదంతా నూకు తెల్వదు— మంచిగ చెప్పినాం. ఇనకుంటే మీదే జుమ్మేదారి."

అనేసి వెళ్ళిపోయారు వాళ్లు.

సాయంత్రం మూడవుతుండగా మళ్లీ కాలనీ వాళ్ళందరం అత్యవసర సమావేశం జరిపాం.

"ఆ రౌడీ వెధవల్తో ఎందుకొచ్చింది. వెళ్ళివాడికే వేసేద్దాం పదండి." అన్నాడు శాయిరామ్.

"చూస్తూ చూస్తూ వాడినా ఎన్ను






కునేది?" అన్నారొకరు.

"మన చేత్తో మనమే కళ్లు పొడుచుకుంటామా?" అందింకొకావిడ.

జనార్దన్ రెండు చేతుల్తో తల పట్టుక్కూచున్నాడు.

మరో అరగంట తర్వాత నాకో అయిడియా వచ్చింది.

"సోదరులారా! త్వరగా పోలింగ్ బూత్ కెళ్దాం పదండి. వెళ్లి, బాలెట్ పేపర్ వెనుక ముద్రవేసి వచ్చేద్దాం. దాంతో మన వోట్లన్నీ 'ఇన్‌వాలిడ్' అవుతాయ్. ఎవరికీ వేయలేదన్న సంతృప్తి మనకూ ఉంటుంది. వాడికే వేశామని వాడు అనుకుని మన జోలికి రాకుండా ఉంటాడు-"

అందరూ నా ఆలోచనకు చప్పట్లు కొట్టారు. కొంత మంది ఈలలు కూడా వేశారు. వెంటనే ఎలక్షన్ బూత్‌కి ఊరేగింపులా వెళ్లాం.

కానీ పది నిమిషాల్లో వెనక్కు తిరిగి రావాల్సివచ్చింది. కారణం అప్పటికే మా వోట్లు ఎవరో వేసేశారు.

ఆ మర్నాడు రాత్రి మా కాలనీలో కొచ్చిన పెద్ద ఊరేగింపు చూడ్డానికి అందరం బయటి కొచ్చి నిలబడ్డాం! శంకర్‌దాదా పెద్ద కార్లో దండల మధ్య నిలబడి అందరికీ నమస్కరిస్తున్నాడు. "శంకర్‌దాదా జిందాబాద్" అంటూ కేకలు మార్మోగిపోతున్నాయ్. అప్రయత్నంగా అక్కడ గుమికూడిన మేము కూడా అరిచాము.

"శంకర్‌దాదా జిందాబాద్"

★ ★ ★



# "తెలుగుదేశం"తో ముఖాముఖి



ఏప్రిల్ 28, 1982న శ్రీ ఎన్. టి. ఆర్ తో

జరిపిన ఇంటర్వ్యూలో ఆనాడు ఆయన వ్యక్తంచేసిన సదాశయాలను అమలుపరిచే రోజు ఈనాడు వచ్చింది... అందుకే కొన్ని ముఖ్యాంశాలని పునఃప్రచురిస్తున్నాము.

"మీ పార్టీ అధికారంలోకి వస్తే వెంటనే మీరు తీసుకొనే నిర్ణయాలు ఏమిటి? చేసే కార్యక్రమాలు ఏవిధంగా వుంటాయి?"

ఈనాటి పరిస్థితులకు సతమతమవుతూ, సంసారాలు గడపలేక, పిల్లల్ని పెంచుకోలేక, బ్రతుకలేక, చావుబ్రతుకుల మధ్య నలిగే బడుగు ప్రజానీకాన్ని తీర్చిదిద్దటం నా పార్టీ లక్ష్యం



ఉచిత విద్య, వైద్య సౌకర్యాలు, పిల్లలకు ఉచిత మధ్యాహ్న భోజనం, ఆరోగ్యకరమైన వాతావరణాన్ని, వాస యోగ్యమైన ఇళ్ళను కల్పించాలనే సంకల్పం

విద్యద్వారా విజ్ఞానాన్ని అందించడం ప్రథమ కర్తవ్యం. ఆరోగ్య పరిరక్షణ ద్వితీయ కర్తవ్యం.

విద్య నమ్ముకొనే విధానానికి స్వస్తి చెబుతాం. విజ్ఞానానికి రక్షణ కల్పిస్తాం.

మురికి కుంటలుగా మారిన వైద్యశాలలు అందరికీ అందుబాటులో వుండే పరిశుద్ధమైన, ప్రయోజనకరమైన ఆదర్శ వైద్యాలయాలుగా తీర్చిదిద్దబడతాయి.



ధనవంతుల మేడలలో, ఫైవ్‌స్టార్ హోటళ్ళలో, నిష్ప్రయోజనము అయిన పనులలో మురిగిపోయే పెట్టుబడినంతా గ్రామీణాభివృద్ధికి, పరిశ్రమాభివృద్ధికి కేటాయించి, దేశీయ సంపదను పెంపొందించే అభ్యుదయ కార్యక్రమాలకు వినియోగించబడుతుంది.



జాతీయం చేసిన బ్యాంకు నిధులు, భీమానిధులు దేశీయ అభివృద్ధికి మరలించబడతాయి.

జాతి చైతన్యం, స్వయంపోషకత్వం సాధించడం మా సిద్ధాంతం

"ప్రాంతీయ పార్టీని స్థాపించడంలో మీ ఉద్దేశం ఏమిటి?"

ప్రస్తుతం నెలకొనివున్న పరిస్థితుల్లో జరుగుతున్న అన్యాయాలు, రోజురోజుకి దిగజారిపోతున్న నైతిక విలువలు, సంఘంలో ప్రబలిపోతున్న దురాచారాలు ఇవనీ నన్ను నిర్ణయం తీసుకొనడానికి ప్రేరేపించాయి.

సామాన్య ప్రజానీకానికి ఎదురవుతున్న అనేకనేక సమస్యలు నేను పార్టీ పెట్టడానికి ప్రోత్సహించాయి" అన్నారు రామారావు.

"తెలుగుదేశం జాతీయ పార్టీగా మారే అవకాశం ఏమైనా వుందా? అంటూ చివరి ప్రశ్న

"ప్రస్తుతానికి ఇది ప్రాంతీయపార్టీ మాత్రమే" అన్నారాయన. ★

---



## అడ్డము

2. శ్రీమతి గాంధీ
5. ఆదివారానికి సోమవారం
7. రక్షణ
9. మధ్య
11. సాగు
12. పన్నీరు- అంటారు గులాబిని
13. మధుర దైవం.
15. తలతిరుగుడు రచయిత్రి
17. స్నానానికి సబ్బు
18. సూరకవిది సుత్తిపెట్టు
19. ఒక వ్యాపార కేంద్రం
21. మనం ఉంటున్నది.
23. రుచి విశేషం
24. నిరంకుశ పరిపాలనలో అక్రమం
26. సంధ్యారాగం
27 బహూశా
29. దీనిలోనే తెలుగుతనం ఉంది.

## నిలువు

1. చిన్నదైనా శుభసూచకం।
2. మిక్కిలి.
3. ప్రచార సాధనం,
4. బానిసలా, సినిమాలా కోరేది.
7. నిదానించడానికి
8 కావాలి కంటికీ, ఇంటికీ।
11. రోదసీయాత్ర చేసింది.
12. గురజాడ బొమ్మ
13. విచారం
14. చెట్టు.
16. లోహవిశేషం.
20. ఒకరకం భూమి. దాన్ని అక్రమంగా ఆక్రమించేవాడు।
22. సగం ఋతువు.
23. ఇవి కాలుటకా? చెడిపోయి మారుటకా?
25. పలుకులలో తిరిగిన లోయ
26. ఎడారిలో ఒంటె.
28. తిరగేసి ఆరగించు.

## ఫిబ్రవరి పజిల్‌కి సొల్యూషన్

| అడ్డము | నిలువు |
|---|---|
| 1. ఏకాకి | 1. ఏకలం |
| 3. మనవి | 2. కిలో |
| 5. లోభి | 3. మగ |
| 7. వగ | 4. విద్యుత్తు |
| 8. లంక | 6. భిషక్కు |
| 10. షట్పది | 7. వదిన |
| 11. మత్తు | 9. కటా |
| 12. టానిక్కు | 11. మనం |
| 14. నవీనం | 13. నియంత |
| 16. పాతర | 15. వీరేశ |
| 18. త్రిశతి | 16. పాలు |
| 20. కౌలు | 17 రవిక |
| 21. విటుపు | 18. త్రిపుం |
| 22. గని | 19. తీగ |
| 24. ఊక | 20. కౌముది |
| 25. రమా | 23 నియతి |
| 27. దివిటీ | 24. ఊటీ |
| 28. యయాతి. | 26 మాయ |

విజేతలు : ఎన్. వుదయలక్ష్మి, గుంతకల్; ఎన్.కె. రామారావు, నల్లగొండ; అలపర్తి రత్నకుమారి, నందివెలుగు, ఎమ్. శివరామమూర్తి, విశాఖ; బి.బి.ఆర్. కృష్ణమూర్తి, పెక్కలి, తోట చంద్రశేఖరరెడ్డి, తిరుపతి: పి సరస్వతి మలికిపురం; పి.బి రామదాసు, విజయనగరం, ఆర్ శ్రీమన్నారాయణ శర్మ, నల్లగొండ, పంతంగి విద్యాసాగర్, చిట్యాల.

బహుమతి 100 రూ.లు. (విజేతలకి సమానంగా పంచబడుతుంది)

**మాకు ప్రహేళికలు చేరవలసిన ఆఖరిరోజు ప్రతినెల 20వ తారీకు**

పజిల్ పూరించి మీ చిరునామా కూడా రాయడం మరువకండి.

ఫిబ్రవరి సంచికలో ప్రహేళిక గడువుతేదీ, బహుమతి, వివరాలు తెలియ బరచనందుకు చింతిస్తున్నాము.

# వెలుతురొస్తుందా!

## మన్నె నరసింహారావు

రాత్రి బాగా ముదిరి పోయింది. వెన్నెల ఎటుచూసినా దేశంలోని ప్రజల మల్లే దిక్కు లేకుండా దీనంగా, హీనంగా ఎక్కడ చూసినా పిక్కటిల్లి పోయి కాస్తూ ఉంది అంతా నాశనమై పోతున్నట్టు సముద్రం హోరు పెడుతూ గోలచేస్తూ ఉంది. సముద్రపు కెరటాలు కాట్లకుక్కలా మీదకు పరిగెత్తుకొస్తూ కర్ర చూపిస్తే ఆగిన కుక్కలా హద్దుమీరి రాకుండా ఆగిపోతున్నాయ్ రాత్రి ఒంటిగంట దాటిపోయింది సముద్రపొడ్డున పడవల ఆవల ఇద్దరు నిశాచరులు "తల్లీపిల్లడు" నిద్ర లేకుండా కూర్చొని ఉన్నారు. పెళ్ళి కాకుండానే, మొగుడు రాకుండానే పాపపు కడుపు చేసుకుందా ఆడది. సృష్టిలో అందరు పుట్టినట్టే ఆ పిల్లడు ఆరేళ్ళ క్రితం ఆమెకు ఇరవై ఏళ్ళప్పుడు పుట్టుకొచ్చాడు. ఆమెకి మొగుడంటూ ఒకడు లేడు. పిల్లడికి తండ్రంటూ ఒకడు లేడు వారికి మరే దిక్కూ లేదు ఉన్నట్టుండి పిల్లడు అడిగాడు "అమ్మా ఇందాక వచ్చిన పెద్దోళ్ళు నిన్ను ఆ పడవల చాటుకి తీస్కెళ్ళింది ఎందుకె?"

"వాళ్లు ఆనందాన్ని, ఆడదాన్ని కొనుక్కొంటారు బాబూ" చెప్పింది తల్లి

"కొనుక్కోవటానికి నువ్వేమన్నా పంచదార చిలకవా? సూగుజీడివా?" అడిగాడు పిల్లడు.

"వాళ్ళకి పంచదార చిలకల కంటే నేనే తీపి ఎక్కువయ్యా!" చెప్పింది తల్లి.

అయితే ఇక్కడే కొనుక్కో వచ్చుగా? ఆ పడవల చాటున దేనికి?" అడిగాడు పిల్లడు

"కొన్ని బేరాలు చాటున చేస్తేనే మంచిది బాబూ" చెప్పింది తల్లి.



# రెండు జెళ్ళ సీత

జంధ్యాల — కేశవరావు

పిల్లడు తల్లి ఒళ్ళో తలపెట్టుకొని దిక్కులకేసి చూస్తూ పడుకొన్నాడు. తల్లి కళ్ళల్లో ఉబికిన కన్నీళ్లు చెంపల మీదుగా జారి పిల్లడి మొఖంమీద పడ్తున్నయ్.

పిల్లడు తల్లి కళ్ళల్లోకి చూసి అడిగాడు. "ఎందుకమ్మా ఏడుస్తున్నావ్."

"మన బ్రతుకుల్లో ఏడుపు తప్ప ఇంకేం మిగిలుంది బాబూ" చెప్పింది తల్లి.

"బాధ కలిగినప్పుడు ఏడుపు వస్తుందని. ఏడుపు వచ్చినపుడు దేవుణ్ణి తలచుకోవాలని మా పంతులుగారు చెప్పారే" అన్నాడు పిల్లడు.

"ఆ దేవుడు మనల్నెరగడు బాబూ" అంది తల్లి.

పిల్లడు దూరంగా కనబడుతున్న పట్టణంలోని మేడలవంక చూస్తూ పడుకొన్నాడు. కొంచెంసేపు అలా పడుకొని తల్లిని మళ్ళీ అడిగాడు, "అమ్మా! ఆ కనబడే ఇళ్ళంత పెద్దవి మనకెపుడొస్తాయే."

"నువ్వు పెద్దాడివై గొప్ప చదువులు చదివి డబ్బులు సంపాదించి అంతకంటే పెద్ద మేడలు కడుదువులేరా!" అంది తల్లి.






"సరేలే! రాత్రిళ్లు నిద్రలేకుండా కూర్చోడం, పగలల్లా నిద్రపోడం, ఇంకా నేనెప్పుడే చదువుకొనేది?" నిష్ఠురంగా అడిగాడు పిల్లడు.

"ఆరిపోయిన బ్రతుకుల్లోకి ఎప్పుడో అప్పుడు వెలుగురాక పోతుందా అని ఎదురుచూస్తున్నాను. ఆ రోజు వచ్చినపుడు నిన్ను తప్పకుండా గొప్పవాణ్ణే చేస్తాలేరా" అంది తల్లి.

"అమ్మా! అపుడు నేను పెద్ద చదువులు చదివి డబ్బు సంపాదించి ఈ దేశానికి రాజునవుతానే" అన్నాడు పిల్లడు.

"అంత ఆశలు మనలాటి వాళ్ళకి ఉండకూడదురా! నువు ఏది సాధించినా, సాధించలేకపోయినా ఒక ఆడదానికి తాళికట్టిన భర్తవి. బిడ్డలకి కన్న తండ్రివి కావాలి" అంది తల్లి.

"నువ్వు చెప్పినట్టే చేస్తానే" అన్నాడు పిల్లడు.

ఇద్దరూ కొంచెంసేపు ఆ ఇసకలో పడి నిద్రపోయారు. బ్రతుకులో వెలుగు కొసం ఎదురుచూసే ఆ చీకటోళ్ళు తూర్పున పలుచగా వెలుగు రేఖలు ఉదయించటంతో లేచి మెల్లగా పట్టణం వైపుకి బయల్దేరారు. ★

(జ్యోతి మినీకథల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ)

# రెండు జెళ్ళ సీత

జంధ్యాల

## భారతీయ అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలకి ప్రమాదమా?

అంతర్జాతీయ చలనచిత్రాల పండగ యీ ఏడాదీ వచ్చింది....వెళ్ళింది. ఢిల్లీలో పదిహేనురోజులపాటు జరిగిన తొమ్మిదవ అంతర్జాతీయ చలనచిత్రోత్సవం బహుమతి ప్రధానోత్సవంతో జనవరి 17న ముగిసింది.

1952 నుంచి మనం చలనచిత్రోత్సవాలు జరుపుతున్నాం. నిర్వాహకులు మారినా ముప్పైఏళ్ళ అనుభవం వీటివెనక వుంది. అయినా ప్రతి ఏడాదీ అవకతవకలు తప్పటంలేదు. నిర్వాహణ లోపాలు ఎన్నివున్నా, చిత్రోత్సవంలో చిత్రాల స్థాయి బావుంటే చాలులే అని గతంలో చాలాసార్లు తృప్తి పడటం జరిగింది. కానీ యీసారి జరిగిన యీ తొమ్మిదవ అంతర్జాతీయ చలన చిత్రోత్సవం ఏరకంగా చూసినా గత చిత్రోత్సవాలన్నింటికంటే నాసిగా వుంది. చిత్రోత్సవ సమయానికి చేతికందిన కొన్ని చిత్రాలు ప్రదర్శించినట్టు వుంది తప్ప అంతర్జాతీయ చలన చిత్రస్థాయి ఏమాత్రం లేదు. ఆఖరి నిమిషం వరకూ చాలా ముఖ్యమైన విషయాల్లో కూడా నిర్ణయాలు తీసుకోలేకపోవటం యీ చిత్రోత్సవపు ప్రత్యేకత.

బ్యూరో సభ్యుల నిర్ణయం, బ్యూరో ఛైర్మన్ ఎవరో నిర్ణయించటం, ఎంపిక చేసిన చిత్రాలేవో....ఏవి పోటీ విభాగంలోనివో, ఏవి సమాచార విభాగంలోవో చివరి క్షణంవరకూ ఎవరికీ తెలియదు. చిత్రోత్సవం ఆరంభం అయి ముగిసేవరకూ చిత్రాల ఎంపిక జరుగుతూనే వుంది. పోటీ విభాగంలో కూడా ఎప్పటికప్పుడు చిత్రాల్ని చేర్చటం, తొలగించటం జరిగింది. కాన్స్ చిత్రోత్సవంలో బహుమతి పొందిన లెస్సింగ్, యోల్ చిత్రాలప్రదర్శనే యీ చిత్రోత్స

వి. రాజారామమోహనరావు

వం పట్ల కొంచమేనా వుత్సాహం మిగలటానికి ముఖ్య కారణం అంటే అతిశయోక్తి కాదు. వాటి ప్రదర్శనా ఆఖరి క్షణం వరకూ యిదమిద్ధంగా తేలలేదు.




అరవై లక్షల రూపాయల కేటాయింపు, పోటీ, సమాచార చిత్రాల విభాగం, ఇండియన్, రెట్రాస్పెక్టివ్, ఫ్రాన్ రెట్రాస్పెక్టివ్ ...వందల సంఖ్యలో విదేశీ ప్రతినిధులు, ఫిలిమ్ మార్కెట్, 16 ఎమ్.ఎమ్. చిత్రాల ప్రదర్శన, విద్యార్థుల చిత్రవిభాగం ....టి.వి. సినిమాల మీద సిరోయిజం ...అన్ని హంగులూ, ఏర్పాట్లూ గత చిత్రోత్సవాలకేం తీసిపోలేదు.. పోతే ఏ విభాగం సంతృప్తికరంగా లేదు. ఫిలిం మార్కెట్ కూడా గతసారికన్నా ఏమాత్రం మెరుగ్గా లేదు.

అసలే పేదదేశమైన భారతదేశానికి యిన్ని లక్షల డబ్బుతో కూడిన చలన చిత్రోత్సవాలు ఎందుకన్న విమర్శ వుండనేవుంది దీనికితోడు గత సంవత్సరం మన పొరుగుదేశం మనీలాలో తలెత్తిన చిత్రోత్సవం ఎంతో మెరుగ్గా వుందన్న అభిప్రాయం బలపడుతోంది ఇవి ప్రత్యక్షంగా కనిపిస్తున్న సమస్యలు. యివేకాక పరోక్షంగా మొత్తం ప్రపంచ చలనచిత్ర రంగానికే బెడదగా మారిన చాలా సమస్యల ప్రభావం కూడా వుంది.

ముఖ్యమైంది వీడియోల ప్రభావం. నానాటికీ సాంఘికంగా పెరుగుతున్న క్రౌర్యానికి గడిపి చాలామంది చాలాదేశాల్లో వినోదం కోసం యిల్లు కదలటానికి యిష్టపడటంలేదు. అలాంటివారికి వీడియో చిత్రాలు మంచి సౌకర్యం సౌకర్యం, భద్రతా మూలంగా వీడియోలు అపరిమిత జనాదరణను పొందాయి దాంతో ప్రపంచం మొత్తంమీద చలనచిత్ర నిర్మాణం చాలా సాధకబాధలకు గురి అవుతోంది చలనచిత్ర వ్యాపారం క్లిష్ట సంఘర్షణలో చిక్కుకుంది. చిత్ర నిర్మాణ సంఖ్య, అనుబంధంగా మంచి చిత్రాల సంఖ్య ప్రపంచవ్యాప్తంగా తగ్గుతోంది దీనికితోడు వ్యాపారపు అడ్డదార్లు మరిన్ని సమస్యల్ని తీసుకొస్తున్నాయి. మంచి చిత్రం కళ్ళబడితే చాలు, ఒక్కసారి దాని ప్రదర్శన జరిపితే చాలు, అది వీడియో కేసెట్‌గా బదిలీ అవుతోంది. అలా బదిలీ అయిన కేసెట్

నుంచి కొన్నివేల ప్రతులు వెలువడతాయి. చిత్రం విడుదల కాకముందే డబ్బు వీడియో పరం అవుతోంది. నిర్మాతకి మిగిలేది నష్టమే. ఈ దొంగ వ్యాపారానికి పెట్టుబడి తక్కువ....లాభాలు ఎక్కువ. ఇది చిత్ర నిర్మాతలకి పెద్ద బెడదగా మారింది. అందుకే వ్యాపారానికి పూర్వం భద్రతదృష్ట్యా చిత్రోత్సవాలకి తమ చిత్రాలు పంపటానికి చాలా మంది నిర్మాతలు విముఖత్వం చూపుతున్నారు. ఆ చిత్రోత్సవపు స్థాయి చాలా వున్నతంగా వుంది. అందులో పాల్గొనటం వల్ల అంతర్జాతీయంగా చిత్రవ్యాపారానికి, పేరు ప్రఖ్యాతులకి ఎక్కువ ఆస్కారం వుంటే తప్ప, మంచి చిత్రాలు చిత్రోత్సవాలకి లభించే ఆస్కారం లేదు.

ప్రపంచంలో పెద్దదైన వో చిత్రోత్సవాన్ని ఇన్నేళ్ళగా మనం నిర్వహిస్తున్నాం. భారతదేశ చిత్రోత్సవానికి ప్రపంచస్థాయిలో గొప్పగా చెప్పుకునే గౌరవస్థితి రాలేదు. అందుకే అనేక చిత్రోత్సవాల తర్వాతే యీ చిత్రోత్సవానికి చిత్రాలు పంపాలని చాల మంది చూస్తారు. మంచి నిర్వహణ లేక, మంచి చిత్రాలు లేకపోటం భారతీయ చలనచిత్రోత్సవాలకి అన్నిరకాలుగా ప్రమాదమే.

అందువల్ల ఇకముందేనా అన్నిరకాలుగా జాగ్రత్త పడకపోతే మన చిత్రోత్సవాలకి యీసారి జరిగినట్టు మంచి చిత్రాలు లేకపోవటమేకాక చిత్రోత్సవాలు విరమించాల్సిన ప్రమాదంకూడా రావచ్చు ఈ రకం సమస్యల్ని గమనించి చాలామంది ప్రముఖులు, చిత్రరంగంలో అనుభవజ్ఞులు ఈ చిత్రోత్సవంలో చాలా సూచనలు చేశారు. అంతేకాక యితరత్రా వినిపించినా, తోచిన వుద్దేశాలూ చాలా వున్నాయి అందులో ముఖ్యమైనవి.... మన ప్రతి చిత్రోత్సవానికి నెలో రెండునెలలో ముందు మంచి చిత్రాలకోసం ప్రయత్నించటం కాక వో కార్యవర్గ బృందం మొత్తం సంవత్సరం పొడుగునా మంచి చిత్రాలకోసం




ప్రయత్నించాలి. ఎక్కడ ఏ మంచి దర్శకుడు కొత్త చిత్రం ఆరంభించినా చిత్రోత్సవాన్ని దృష్టిలో వుంచుకుని ఆ చిత్రంకోసం ప్రయత్నం చెయ్యాలి. అన్నిరకాలుగా, ముఖ్యంగా ప్రేక్షకుల దృష్ట్యా చిత్రోత్సవాల స్థాయిని పెంచే

"కాంప్లాన్® మాత్రమే మా కుటుంబానికి సరియైనది–సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం."

## కేవలం కాంప్లాన్® లోనే

## అందరికీ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.

కేవలం కాంప్లాన్ లోనే శాస్త్రీయంగా రూపొందించిన పాళ్ళల్లో, మన శరీరానికి ప్రతిరోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి....ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన పానీయం.

రుచికరమైన చాక్లెట్, యిలక్కాయ–కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది — ప్లెయిన్ (సాదాగా) కూడా.




# కాంప్లాన్®

–సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

LINTAS-GLC-10-1819 TL

ప్రయత్నం చెయ్యాలి. చిత్రోత్సవా
లంటే సెక్స్, క్రౌర్యం నిండిన
దృశ్యాల వీక్షణ కాదని.... అత్యంత
ప్రతిభావంతమైన సినిమా మాధ్యపు
ఆర్థిక సాంకేతిక ప్రగతికి, అనేక దేశాల పరస్పర అవగాహనకి వేదిక అని ప్రజలు
గ్రహించే స్థితికి చిత్రోత్సవాల నిర్వహణ స్థాయి చేరాలి..... ఏ చిత్రాలు
చూపుతారో తెలుపకుండా లాటరీ పద్ధతిలో ప్రేక్షకులకి టిక్కెట్లు అమ్ముతున్న
ప్రస్తుత పద్ధతిమాని, ముందుగానే ఆ చిత్రం స్థాయి ప్రతిభ వారికి తెలిపే వివ
రాలు నిర్వాహకులు సమీకరించే చిత్ర ప్రదర్శనకి ముందుగానే వారికి అందేలా
చెయ్యాలి. ఈసారి జ్యూరీ ఛైర్మన్ శ్రీలిండ్సే యాండ్రూస్ సూచించిన మరో
ముఖ్యవిషయం వుంది. భారత చిత్రోత్సవాలలో థర్డ్‌వరల్డ్ కంట్రీస్‌కి ప్రోత్సా
హం యివ్వాలన్న దృష్టితప్ప పేట్రనైజ్ చెయ్యాలన్న దృష్టి వుండకూడదన్నది.
అలాగే పోటీ విభాగపు చిత్రాల ఎంపికలో అంతర్జాతీయ చలన చిత్రోత్సవపు
స్థాయిని దృష్టిలో వుంచుకోవాలన్న సూచన.

ఈసారి పోటీ విభాగంలోని చిత్రాలు ఎంత నాసిగా వున్నాయంటే యీ
చిత్రోత్సవపు అత్యుత్తమ బహుమతి బంగారు నెమలిని ఏ కథా చిత్రానికి, లఘు
చిత్రానికి యివ్వలేక పోతున్నాం అని జ్యూరీ ప్రకటన వెలువడినప్పుడు
అందరూ సంతృప్తిగా పెద్దపెట్టున హర్షధ్వానాలు చేశారు. ఇంక యితర వుత్స
వాల్లో బహుమతి పొందిన, సాంకేతికంగా ప్రతిష్టాకరమైన చిత్ర ప్రదర్శన
వుండే సమాచార విభాగంలోయీసారి క్రేజిబాయిన్‌వెర్సెస్‌డ్రాకులాపూర్తినిడివితోలు
బొమ్మలాట చిత్రం, మరికొన్ని డాక్యుమెంటరీ చిత్రాలు చోటు చేసుకున్నాయి
వున్నంతలో యీసారి భారతీయ విభాగమే మెరుగు. ★

---

కలం కన్ను

ప్రియా
నీ నా కళ్ళలో
ఇంకిన నీరు
జీవిత నవలకి
సరిపడే సిరా!

ఎ.ఆర్. రావు

సీరియల్

# సౌభాగ్యలత

అరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి రామశాస్త్రి

-: జరిగిన కథ :-

(మహేష్ ప్రవర్తనల వలన అతనికి జరగబోయే ప్రమాదాన్ని గుర్తు చెయ్యాలని మహేష్‌వాళ్ళ ఇంటికి వెళ్లారు వకుళ, శ్రీమంత్. హెచ్చరిక వినకపోగా లంచమెంత కావాలని అడిగాడు మహేష్. వకుళని శశిరేఖ అవమానించింది. ఐనా మహేష్‌కి లోలోన శ్రీమంత్ వకుళ ఆదర్శాలపై గౌరవం ఉంది. శశిని గర్హించాడు. శారదకోసం, భర్త అమెరికా యాత్రకోసం ముప్ఫయివేలు సర్దమని కోటయ్య శ్రీమంత్‌ని అడిగాడు. అతను షాక్‌లోంచి ఆలోచనలోకి వచ్చాడు.)

- ఇక చదవండి -

శ్రీమంత్ భారంగా నిట్టూర్చాడు.

"ఒరేయ్, అది మన యింటి ఆడపిల్ల, ఆడపిల్ల కోరికలు ఆనందంగా తీర్చకపోతే నీకు సుఖం వుండదు. భర్తవెంట వెళ్ళలేకపోయానని అది క్రుళ్ళి




పోతూ ఇక్కడుండటం నీకు జయ కరం కాదు".

"నాన్నా, ఇల్లంతా అయినకాడికి అమ్మి తన పెండ్లే చేశాంకదా? ఇంకేం మిగిలిందీ ఈ ఉద్యోగం మినహా?"

"మనసుంటే మార్గముంటుంది అబ్బాయ్, నీ ఆఫీసులో 'లోన్' తీసుకో వచ్చట కదూ?"

"ఓ! ఆ ఉపాయాలు కూడ అతడే చెప్పాడన్నమాట''

"ఏమంటావు?"

"సరే, కానీ ఓ పదివేల కంటే నాకు బహుశః లోన్ దొరకదు. దానికీ కొంత టైము పడ్తుంది."

అదనుకోసమే వేచివున్నట్టు ప్రక్క గుమ్మంలోనుండి శారద ప్రవేశిం చింది.

"అలా అంటే ఎలా అన్నయ్యా? పూర్తిగా ముప్పై అవసరమన్నారు ఆయన".

"నేనేం జమిందార్ని కాదని ఆయనకు చెప్పు".

వెంటనే జలపాతాలు దుమికాయి శారద కపోలాలపై,

"ఆయనకేం? ఒక్కరూ వెళ్ళిపోతారు, అక్కడ నుండి ఎవతెనో వెంట బెట్టుకొస్తారు, ఎలా ఏడ్చినా నేనేగా?"

అదిరిపాటుతో తండ్రి దెసచూశాడు శ్రీమంత్.

"ఔను అబ్బాయీ, నా భయమూ అదే. అలాంటివి అనేకం వింటు న్నాం ఈ రోజులలో, ఇటు శారద వట్టిమనిషి కూడా కాదు, అంతదూరం పంపా లంటే కూడ నాకు భయంగానే వుంది!"

"మరి?"

"పాపం. శారద తల్లిలేని పిల్లరా, దానికేం అచ్చటా ముచ్చటా తీరిం దని? తండ్రిని నేనైనా దగ్గరుంటే దానికి ఈ స్థితిలో మనస్సుకు బలంగా వుంటుంది. అక్కడ నౌకర్లూ వాళ్ళూ వుండరటగా? ఇంటిపనీ, పిల్లపనీ ఎలా




చూచుకుంటుంది? నేనైతే సాయంగా వున్నట్లూ వుంటుంది– నేను ఆ దేశం చూచినట్లూ వుంటుంది".

అంతలో వకుళ అటుగా రావడంతో తండ్రీ కొడుకులు సంభాషణ కట్టి పెట్టి లేదారు.

వకుళ మనస్సు చివుక్కుమన్నది

ఎంతగా బాధ్యత నెత్తిన వేసుకున్నా, ఎంత కలసిమెలసి వున్నా తాను వారికి పరాయిదేనా? వారి విషయాలు వినకూడనిదా తాను?

రాత్రి ఏకాంతంలోనైనా ఆ విషయాలు అతడేమైనా తనతో చర్చిందును తాడని చూచింది వకుళ, కానీ శ్రీమంత్ ముభావంగా, దీర్ఘాలోచనా నిమగ్నుడై వున్నాడే కానీ ఏమీ మాటలాడటం లేదు.

చెంత కూర్చుని మెల్లని స్వరాన అన్నది;

"శ్రీమంత్! నా మీద కోపమా?"

"ఎందుకూ?"

"అక్క యింటికి బలవంతంగా

శ్రీ భ్రమరాంబికా ఫిలింస్

రెండు జెళ్ల సీత

జంధ్యాల

కేశవరావు

తీసుకెళ్ళినందుకు"

"ఛఛ, మానవులుగా మన ధర్మం అది, వినకపోతే మనం మానవులం కాదుగా?"

"మరి? అలా ముభావంగా వున్నావేం నాతో," ...నిట్టూర్చాడు సమాధానంగా.

"ఏమైనా సమస్యవుంటే నాతో చెప్పడానికేం?" ఆదరంగా ఆమె శిరస్సు నిమురుతూ అన్నాడు.

"పడుకో, నువ్వెందుకు మనస్సు పాడు జేసుకోవడం? నా సమస్యలు ఎవరూ తీర్చగలని కావు "

"తీర్చగలననే అనుకుంటున్నాను, ఇదుగో నీ సమస్యకు పరిష్కారం!"

"ఏమిటి?"

వకుళ తన చేతిలో వుంచిన నగలను అయోమయంగా చూస్తూ అన్నాడు.

"నా నెక్లెస్, గాజులూ! అమ్మితే ముప్పైవేలకు పైగానే వస్తాయి "

"ఇవి నీ పుట్టింటినుండి వచ్చిన ఒకే ఒక్క విలువైన వస్తువులు నీకు!"

"ఇక నీ నా బేధం ఏమిటి మనకు? అవి మనవి!"

"అయితే నువ్వు నాన్నగారి మాటలన్నీ విన్నావా?"

"ఆఁ, నీ మనస్సు అసలే వికలంగా వున్నది, అది ఇంకా వికలంగా చేసుకోకు! ఈ సమస్యను వీటితో పరిష్కరించు, శారద ఆనందిస్తుంది."

కొన్ని నిమిషాలు ఆలోచించాడు శ్రీమంత్.

"మనస్ఫూర్తిగా ఇస్తున్నావని అనుకోను. స్త్రీకి యివి అలంకార చిహ్నాలు".

"నిజం శ్రీమంత్ మనస్ఫూర్తిగా నేనేకాదు, ఏ ఆడదీ ఇవ్వదు. కానీ నువ్వు ధనికుల అల్లుడవని కదా వాళ్లు అలా అడుగుతున్నారు? నీ భార్యగా నీ మనస్తాపం నేను చూడలేను అందుకే రెండు విధాలా కూడ ఇది నా బాధ్యతేనని నిర్ణయించుకున్నాను"

ఆమె కనులలో తడిని స్పష్టంగా చూడగలిగాడు శ్రీమంత్.

ఆ నగలను తీసుకోవడానికి మనస్సంగీకరించడం లేదు.

కానీ అంతకంటె మార్గం లేదు.

"వెళ్ళు శ్రీమంత్. ఇవి మామయ్యకు ఇచ్చిరా"

గత్యంతరంలేని శ్రీమంత్ భారంగా ప్రక్క గదిలోనికి నడినాడు.

శారదముఖం విప్పారింది.

ఆనందంగా అందుకున్నది ఆ నగలను.

"అయితే, నేనూ నాన్నా రేపే వెళ్తాం అన్నయ్యా, ఏర్పాట్లు చేసుకోవాలి; డబ్బు సమకూరినట్లు ఆయనకు తెలియాలి ; వీలైతే వెళ్ళే ముందు వచ్చి వెళ్తాను" అన్నది.

"నీ యిష్టం" ముక్తసరిగా అన్నాడు శ్రీమంత్.

కోటయ్య కూడా తన ఆనందాన్ని ప్రకటించాడు.

"నాకు తెలుసు నా కొడుకు ఉత్తముడు."

శ్రీమంత్ స్వరం తనకు తెలియకుండానే కఠినంగా పలికింది.

"మీ కొడుకు కాదు నాన్నా, మీ కోడలి చలువ అది. ఈ నగలు మాత్రమే ఈ యింటికి గల ఆస్తి. 'ఆడపిల్లా - ఆశలూ' అంటూ మీరేమేమో అన్నారు. కానీ నాలాంటి అర్భకుడు అవన్నీ చేయలేడు. అందుకే మరో ఆడపిల్ల ఆశలకు సమాధి కట్టి మీ మాటను నిలబెడుతున్నాను. మీ అల్లుడి దగ్గర మీ గౌరవం నిలుపుతున్నాను. కానీ ఇకముందు మాత్రం ఇటువంటి వాగ్దానాలు చేస్తే నిలుపలేనేమో ?"

జవాబు శారద నుండి వచ్చింది.

"బాగుందన్నయ్యా, రోజూ మేమెందుకడుగుతాం ? చూస్కో - ఇక మీమే ఎంత సంపాదించి తెచ్చుకుంటామో ?"

నవ్వలేక నవ్వాడు శ్రీమంత్.

"మంచిదే కదమ్మా ? నా చెల్లెలు ఆనందంగా వుంటే నాకూ ఆనందమేగా ?"

శ్రీమంత్ తిరిగి తన గదిలోనికి వచ్చేసరికి వకుళ ప్రక్క వసారాలోనికి

# శ్రద్ధాంజలి



14-2-1936 శ్రీ ఆరెకపూడి రామశాస్త్రిగారు 27-2-1979

మరణం మనుష్యులను దూరం చేస్తుంది కానీ మనస్సులను మరింత దగ్గర కావిస్తుంది.... నిత్యం చిరునగవు నర్తించే మీ రూపస్మరణంలో శక్తినీ, ధైర్యాన్నీ పొందుతూ రోజులు లెక్కిస్తున్నా.... మీ కౌసల్య:

అనుక్షణం దేడీ జ్ఞాపకాలలోనే జీవిస్తున్న మన చిరంజీవులు——

కళ్యాణి, శ్రీకాంత్, నళినీకాంత్

పారిపోయినట్లే వెళ్ళిపోయింది.

తన కంటినీరు అతడు చూడరాదనే అలా పారిపోయినదని అతడికి తెలుసు.

నాల్గు నిమిషాల తర్వాత, కడిగిన ముఖం తుడుచుకుంటూ వచ్చి వకుళ అద్దం ముందు నిలబడింది.

శ్రీమంత్ లేచి వెళ్లాడు ఆమె చెంతకు, కుంకుమ భరిణను తెరుస్తున్న వకుళ చేతికి అతడి చేయి అడ్డు వెళ్ళింది.

తానే యింత కుంకుమ తీసి ఆమె నొసటను దిద్దుతూ ఆ కనులలోనికి పరీక్షగా చూచాడు. అక్కడ ఇంకా దుఃఖం గూడు కట్టుకునే వున్నది.

ప్రేమ అతిశయించగా, అక్కున జేర్చుకుంటూ ఆర్ద్రస్వరంతో అన్నాడు.

"నాకు ధైర్యమూ, ఆలోచనా చెప్పే నువ్వే డీగజారిపోతే ఎలా వకుళా ? శారద కూడా అందరి ఆడవారిలాగే స్వార్థంగా ప్రవర్తింపగలదని నేనెన్నడూ అనుకోలేదు".

"అలా ఎందుకులే శ్రీమంత్ అనుకోవడం. పుట్టింటి నుండి తీసుకు వెళ్లా అనే అనుకుంటారు మన ఆడపిల్లలు. అది సహజం!"

"నువ్వలా అనుకోలేదే ?"

"హుఁ అంతా నాలానే వుండరు"

"ఇప్పుడే యిలా వుంటే మన సంసారం పెద్దదయ్యాక ఏ విధంగా వుంటాయో పరిస్థితులు ?"

కేవలం వకుళ మనస్తాపాన్ని తగ్గించాలని ప్రస్తావన మార్చాడేకానీ, ఆ మాటలు తనకే అసందర్భంగా అన్పించాయి.

"అటువంటి పరిస్థితులలో - మనం అసలు మన సంసారాన్ని పెరగ నీయవద్దు శ్రీమంత్!" వకుళ కంపితగాత్రంతో అన్నది.

"ఛ. ఏంమాటది? నడు, ప్రొద్దుపోయింది" అటు యిటు తిరగడంలో వకుళ పొడవాటి జడ తగిలి టేబిల్‌మీది కుంకుమ భరిణ భళ్లున క్రిందపడింది.

"అయ్యో, ఇదేమిటిలాగైంది?"

చిన్నబోయిన ముఖంతో, నేలపాలైన కుంకుమను భరిణలోనికి తీస్తున్న

వకుళను విసుగుదలగా చూచాడు శ్రీమంత్.

"ఛ. ప్రతిదానికి సెంటిమెంట్స్ మీ ఆడవాళ్ళకు"

"అది కాదు........ .........."

"ఏ కాదు?" రోజూ ఎన్నో వస్తువులు మన చేతుల నుండి జారి క్రిం పడతాయి".

"అన్నిటితో సమం కాదుగా కుంకుమ?"

"చాల్లే, అతిగా ఆలోచించకు."

## 45

"త్వరగా వస్తావుగా శ్రీమంత్?"

ఆఫీసుకు బయలుదేరుతున్నతడిని సాగనంపుతూ అడిగింది వకుళ.

"చెప్పలేను. ఆలస్యమే కావచ్చు ట్రబుల్ ఎక్కువైపోయింది కదా వర్కర్స్ ఏమాత్రం రాజీకి రాలేదు. ఈ రోజు ఎక్కడెక్కడినుండో పనివాళ్ళను తెచ్చి పోలీసు బందోబస్తుతో పని చేయించబోతున్నాం"

వకుళ భయకంపిత గాత్రంతో అడిగింది.

"మరి.. ... . ప్రమాదమేమీ వుండదు కదా?"

అసహాయంగా చూచాడు శ్రీమంత్

"నా స్నేహితుడు సత్యం– తెలుసుగా?"

"అదే- నీకు సాయంగా నిలిచినాయన .. .. . "

"ఆఁ అతడే! అతడి కారుకు హైద్రాబాద్ బొంబే రోడ్డుమీద యాక్సిడెంట్ జరిగిందట, సీరియస్ కేస్ అనీ, ఆస్పత్రిలో వున్నాడనీ విన్నాను. ఆఫీసవర్స్ తర్వాత అతడికి ట్రంకాల్ చేసి పరిస్థితి కనుక్కుంటాను".

"ఆఁ?"

"ఔను వకుళా, బ్రతకడని అంటున్నారు 'సత్యం ధర్మం' అంటూ పోరాడే వారికిటువంటి బాధలు తప్పవేమో? ఈ గొడవలు తగ్గాక వెళ్ళి చూచి రావాలనుకుంటున్నాను."

మ్రాన్పడి నిలిచింది వకుళ. (సశేషం)

Edited & Published by V. Leelavathy Raghavaiah. at 3-5-1039/1 Narayanaguda, Hyderabad-20 & Printed by P. Ramakrishna at Raghava Printers, 1-8-4/1/1, Chikkadpalli Hyderabad-500 020

JYOTI,
MARCH 1983
Regd. NO. H/S





